# పాదుకాపట్టాభిషేకము





ఇది

కొడాలి సత్యనారాయణరావు

గారిచే రచియింపఁబడినది.

రెండవకూర్పు 1000 ప్రతులు.

ప్రకాశకుఁడు:

కురుకూరి సుబ్బారావు.

బుక్ సెల్లర్ అండ్ పబ్లిషరు,

భీమడోలు, పశ్చిమ గోదావరిజిల్లా.

కాకినాడ:

స్కేప్ అండ్ కో., కె. సుబ్బారాయ సోదరులచే

ముద్రింపఁబడియె.

 1927. [ వెల రు 1—0—0.

# ఊర్వశీశాప విమోచనము:

**వెల 0—12—0 మాత్రమే.**

ఇది శ్రీ అయినాపురపు సుందరరామయ్యగారిచే రచియింపబడినది. అన్నిరసములు యిందుగలవు. ఇంద్రుడు శచీరంభలతో సరస సల్లాపము. దూర్వాసుడు ఊర్వశిని యిప్పించమని యింద్రుని కోరుట. ఊర్వశిని ఇంద్రుడురప్పించుట. ఊర్వశి వెట్టుపరిచేయుట. ఆఖరకు ఒప్పుకొనుట. దూర్వాసుడుతనఉద్యానవనముగోనికి వెళ్ళి, కామముతో తపించుట. ఊర్వశి వచ్చుట. దూర్వాసుడు మైబడబోవుట. ఊర్వశి వెట్టుపరిచేయుట. దూర్వాసుడు కోపగించి ఊర్వశికి శాపము యిచ్చుట ఊర్వశి గుఱ్ఱముఅయి విక్రమసేనునకు దొరకుట. శ్రీకృష్ణుని కుమారుండైన మన్మధుడుకూడాఊర్వశీగుర్రమునిమిత్తం ప్రయత్నముజేయుట మన్మధుడు యీగుర్రము దొరికేవరకు సిల్లాహారములు ముట్టను అని ప్రతిజ్ఞజేయుట నారదుడు మన్మధుడు విక్రమసేనుదగ్గరకు గుర్రము కావలయునని చెప్పుట. విక్రమసేనుడు గుర్రము యివ్వనని చెప్పుట. మన్మధుడు నీపని పట్టించెదనని ప్రతిజ్ఞచేయుట. విక్రమసేనుడు అభిమన్యుని శరణుకోరుట. మన్మధుడు అభిమన్యునివద్దకు అక్రూరుడిరాయభారిగా పంపుట. అభిమన్యుడువిడువనని చెప్పుట. అభిమన్యుమన్మధుల యుద్ధము బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ప్రత్యక్షమై యుద్ధమాపుజేయుట. ఊర్వశి శాపవిముక్తయై మనుష్యరూపము పొందు చాలా అద్భుతముగా నుండును, ఇదివరకు అనేక వేలప్రతులు ఖరు అయినవి కొలదిప్రతులుమాత్రమే గలవు. త్వరపడుడు. త్వరపడుడు

వలయువారు:—

కురుకూరి సుబ్బారావు బుక్కు సెల్లర్,

భీమడోలు, కృష్ణాజిల్లా.

శ్రీరామచంద్ర.

# పాదుకాపట్టాభిషేకము.

ఇది

వేలూరు ఆంధ్రనాటక పరిషత్సంఘమువారిచే సువర్ణపతకము
బహుమతి పడసిన సుప్రసిద్ధ నటకులు, "భక్తశబరి"
మున్నగు బహునాటక గ్రంథకర్తలగు

## కొండాపి సత్యనారాయణరావుగారిచే

రచియింపబడినది.




ప్రకటకర్త

కురుకూరి సుబ్బారావు

బుక్సెల్లర్ అండ్ పబ్లిషర్.

పిఠాపురం, తూర్పుగోదావరిజిల్లా.

కె. సుబ్బారాయసోదరులచే స్కేప్ అండు కో., లో
ముద్రింపబడినది.

కాకినాడ.

1927

 [వెల 1-0-0

# ఈ నాటకమునందువచ్చు పాత్రలు

---

## పురుషులు.

1 సూత్రధారుడు.
2 దశరథుడు.
3 రాముడు.
4 లక్ష్మణుడు.
5 భరతుడు.
6 శత్రుఘ్నుడు.
7 వశిష్ఠుడు.
8 సుమంత్రుడు.
9 సేవకుడు.

పుళోండులు మునులు.

## స్త్రీలు.

1 కైక.
2 మంథర.
3 కౌసల్య.
4 సుమిత్ర
5 సీత.



# పాదుకాపట్టాభిషేకము

[నాంది]

చ. జనకుని శాసనంబు శిర • సావహియించి వనాంతరంబులం
దున వసియించనేనిఁ గృప • తోడఁ ద్రిలోకము లేలుచుండి శాం
తినిఁ దన సత్యమార్గమును • దెల్లముగాఁగను జాటినట్టి స
ద్ఘనుఁడగు రామభద్రుఁడు స • దస్యుల నేలెడుఁ గాత నిచ్చలున్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి) సదస్యులారా! నేఁటిరాత్రి తమ సమక్షంబునఁ బ్రదర్శించుచున్న యీపాదుకాపట్టాభిషేక నాటకమును.

గీ. గౌతమసగోత్రజుండు; వేం • కయ్య మంత్రి
సుతుఁడు శివరామకృష్ణుని • సోదరుండు
సత్కవుల దీవెనలఁ బొందఁ • బాలువాఁడు
వ్రాసెను గొడాలి సత్యనా • రాయణుండు.

శ్రీ రామాయణాంతర్గతగాథయగుటఁ గలదోసంబులఁ క్షమించుచు కేవల రసగ్రహణాభిలాషులరై యానందింప వేఁడుకొనుచు సంగీతపురస్సరంబుగ నాటకప్రారంభమునకై వలయు పాత్రంబుల నాయత్తపఱుపఁ జనియెద.

(నిష్క్రమించును.)

నుతులఁ గైకొన్న మీరలే ♦ యతని మొదలఁ
బ్రేమమునుబూని లగ్నంబుఁ ♦ బెట్టవలయు.

వశి—రాజేంద్రా ! సర్వార్థసాధకంబులగు మీరు దలంచుకొనిన విషయంబు సర్వజనాదరణీయము కాదా? శ్రీరామచంద్రుని యభిషేకమునకు నాతఁడుఁ గైకొనుట యుక్తము మేమోయని దలచెద.

దశ—దేవా ! రాఘవుని యభిషేకము నట్లుతే బుచ్చుకొందుము గాని రాఘవుఁడు రాజ్యముఁ జేయుటకుఁ దగియున్నవాఁడని తమకుఁ దృష్టిగలదా ?

వశి—రాజా ! అందునఁగూర్చి వేఱయుడుగవలయునా ? సకలవిద్యలయందసమాన పాండిత్యము గడించి, బాహుబలంబున మిన్నయై, పెక్కుశత్రువుల నణఁగించి, సకల మునివందితుఁడై, రాజకార్యనిర్వహణ తంత్రజ్ఞుఁడై, ప్రజామోదితుఁడై సుగుణాభిరాముఁడై, శాంతమూర్తియై, సత్యవాక్పరిపాలనా దక్షుఁడై, యశోన్వితుఁడై, పరమ పావనమూర్తియై, వెలుఁగొందు శ్రీరామచంద్రమూర్తియెట్లు ? సింహాసనమధిష్ఠింప నర్హుండు గాకుండుటేమి? అందునఁగూర్చి మీకట్టియనుమాన మేలఁ గలిగినదో తెలియకున్నది.

దశ—ఋషిచంద్రమా ! అందులకుఁగాదు !

గీ. భారము వహించియెఱుఁగని ♦ బాలుఁడగుట
రాజ్యతంత్రంబు నేరని ♦ ప్రాయమగుట
కష్టసుఖము లెఱుఁగని ♦ కార్యమగుట
బుకంతఁ దర్హుఁడె ? యుక్తవాదం ♦ చడిగివాఁడ

వసి— అట్టి యనుమానములతోఁ బనేమియు లేదు. రాజా! రాముఁడన సామాన్యుఁ డనుకొనుచుంటివా? బాలుఁడని దలంచుచుంటివా? అతం డవతారమూర్తియనియు, సకలకార్యనిర్వహణ దక్షుండనియు, దుష్టశిక్షణ, శిష్టరక్షణ పరాయణుండనియు, నీవఱకే వినియుంటివి. అంతియ గాక నీ బాల్యమునందే మొన్న మొన్న యతఁడొనర్చిన యద్భుతకార్యంబుల మఱచితిగా?

మ. సవనంబునకై బరిరక్షణంబు సలుపన్ ♦ చాపంబునున్ దాల్చి తా
త్రైవ నిర్మూలముఁ జేసి, గాధసుతుచే ♦ తక్కన్ మన్ననల్ జెందఁడే?
శివచాపం బవలీలఁ ద్రుంచి మునులా ♦ శీర్వాదముల్ సల్ప రా
ఘవుఁడా జానకిఁ జెట్టఁబట్టఁడొకో? తె ♦ ల్పన్? వాసికీకార్యముల్.

మఱియు,

గీ. పతియుడిన శాపమున రాయి ♦ వలెను బెక్కు
వత్సరంబులు పడియున్న ♦ వనిత నిట్టె
కాలితోఁ దాకి శాపమో ♦ క్షంబొసంగి
వడి సహల్య నతండు గా ♦ పాడలేదె?

అంతియగాక నదృశ్యరూపులై మింటనిలచి ముని యధ్వరంబున రక్తధారలు గురిపించినరక్కసులఁ గిక్కురుమనకుండ నుక్కడగించినదెవరు? రాముఁడేగదా? ఇఁక రాచకీయ వ్యవహారములయం దందురా?

గీ. కొలువుఁ దీఱిచియున్న వే ♦ ళలను మీదు
యంకపాళిని ముద్దుగా ♦ నధివసించి
రాజ్యతంత్రంబులను నతి శ్రద్ధ నెఱిఁగి
తగిన జాగ్రతలోనుండె ♦ దశరథేశ.

కాబట్టి నిస్సంశయముగ రామచంద్రమూర్తిని ప్రభునిఁ జేయ వచ్చును.

దశ—అట్లయిన సచివరా! సుమంత్రా! నీవేగి శ్రీరాముని నిటకుఁ దీసికొనిరమ్ము.

సుమం—చిత్తము. (అని వెడలి రామునితోఁ బ్రవేశము.)

రాము—గురువర్యా; తండ్రీ! నమస్కృతులు.

దశ, వశి—శ్రీరామచంద్రా! కామితార్థఫలసిద్ధిరస్తు కూర్చుండుము.

రాము—(కూర్చుండి) జనకా! అత్యంతావసరంబుగా నన్నుఁ బిలువనంపిన కతంబెఱింగించి నా వీనులకు విందొనర్ప వేఁడెద.

దశ—కుమారా!

క. సుతులు, సుతులంచు, నాపోయి ♦ క్రతువొనర్చి
యీశు కరుణారసమున ♦ గ్రహించినాఁడ
సకల సౌభాగ్యయుతుల వి ♦ శారదులను
నాల్గురను, సుగుణాఢ్యు ♦ లైనమిమ్ము.

అట్టివారు,

క. విధివిరామము లేకుండఁ ♦ బెద్దకాల
మును భరించిన యీభార ♦ మును వదల్చి
కొనిన విశ్రాంతిఁ గలిగించి ♦ దైవచింత
నమున నున్నంతురని నమ్మి ♦ నాఁడ మదిని

అందఱిలోనను బెద్దవాఁడవు. మదాజ్ఞా పరిపాలనా దీక్షాబద్ధకంకణుఁడవు. సత్యమార్గానువర్తివి. శమదమాది సద్గుణంబులుగలిగి రాజిల్లువాఁడవు. నీతివిశారదుఁడవు. నీకు విశేషించి తెలుపవలసిన విషయంబులు లేవు. కాన,

గీ. తగినదార్ఢ్యంబులేదు, వా ♦ ర్ధకమువచ్చె
ఒడలు ముడుతలువడె శ్రమఁ ♦ బడఁగఁజాల
యీధరాభారమునువిడాసి ♦ యింపుమీరఁ
దగిన విశ్రాంతినొందఁగుమిదె ♦ తనయనాకు.

రాము—తండ్రి, తమయాజ్ఞయైనచోఁ దప్పదు. కాని,

గీ. ప్రాయమున బాలుఁడను ధరా ♦ భారమూని
కార్యములఁ జక్కఁబఱుపఁగాఁ ♦ గలుగుదొక్కొ?
బహుళ విషయంబులను నేర్వ ♦ వలెనుగాదె
గురులసన్నిధి శుశ్రూషఁ ♦ గోరిచేసి.

అంతియఁగాక,

గీ భరతశత్రుఘ్ను లిటలేరు ♦ వారులేక
పట్టవైభవమెట్టులే ♦ నందఁదగును
వారువచ్చినపిదప మీ ♦ వాంఛరీతి
సలుపరాదొకో? మీమదుము ♦ చ్చటలుదీర.

దశ—బాలకా! నీవుచెప్పిన విషయంబు లాలోచింపఁదగినవేగాని నాస్థితియంతయుఁజూడ నేఁడో రేపో యనునట్లుగానుండుటచే నా గ్రీవస్థయందునసే నిన్నుఁ బట్టభద్రునిఁగావించి నాముచ్చటఁదీర్చుకొందమనుభ్రాంతిచే నిట్లు తొందరపడుచుంటిని అంతియేగాని భరత శత్రుఘ్నులు లేరనుచింత నాకుమాత్రము లేదా? వారువచ్చుదనుకఁగూడ జీవింపఁగలుగుదునను ధైర్యము నాకంతకంత కంతరించుచున్నయది. ఇఁక రాజకీయవ్యవహారములను నేర్పుటవిషయమంత గొప్పదికాదు. కాలక్రమమున నదియే పట్టుపడఁగలదు. దానికింతవిచారమేల? చూడు,

గీ. రాజ్యపరిపాలనాది మ ♦ ర్మములఁ దెల్పు
చుండ నీకండగా వసి ♦ ష్ఠుండుగలఁడు

సర్వవిషయంబులను దెల్పఁ ♦ జాలి నీకుఁ
దోడునీడగ మన సుమం ♦ త్రుండునుండు.

తెలియనివిషయంబుల వారివల్లగ్రహించుచు, నీతివిశారదుండ
వై చక్కఁగా రాజ్యంబును బరిపాలింపఁదగును? శాసనాయా
జ్ఞ నుల్లంఘింపవని తలంచెద.

రాము—తండ్రీ! తమయాజ్ఞయట్లయైనచో మారుమాటాడఁగలనా?
మీయిష్టానుసారంబుగఁ గావింతు.

దశ—అట్లయిన నో వశిష్ఠభగవానుఁడా! రాముండు నాయాశయమీడే
ర్ప బద్ధకంకణుఁడయ్యెఁ గావున సుముహూర్తము నిశ్చయింపఁ
దగును.

వశి—రాజా! దానికింక విచారణమేల? ఎల్లుండి బాగుగనేయున్నది,
పట్టాభిషేక మహోత్సవ మవశ్యమాచరింపఁదగును.

దశ—చిత్తము, రామా! గురువులగు వశిష్ఠులవారు ఎల్లుండి సుము
హూర్తము నిశ్చయించినారుగాన,

గీ. నీవుసతితోడ నుపవాస ♦ నియతినుండి
నిద్రయునుపోక హరిని ధ్యా ♦ నించుచుండి
రేపు గడుపుచు నెల్లుండి ♦ తెలుగాఁగ
సిద్ధముగనుండు పట్టాభి ♦ షేకమునకు.

రాము—తండ్రీ! అట్లనే గావింతును. నాకింక సెలవొసంగెదరా?

దశ—మంచిది పోయిరమ్ము.

రాము—గురువరా! వందనంబు. తండ్రీ! నమస్కరింతును. (అని
నిష్క్రమించును.)

దశ—మంత్రిపుంగవా! నగరవాసులెల్లరుఁ దమగృహంబులఁ జక్కఁగ
నలంకరించుకొనునట్లును, రాజమార్గములన్నియుఁ బరిశుభ్ర

వరచి చక్కని యేర్పాటు లొనర్చునట్లుగను, రాజమందిరము లన్నియుఁ దగురీతిని జక్కఁబఱచునట్లును, పట్టాభిషేకమహోత్సవంబునకు వలయుసమస్తవస్తువులను సమకూర్చుటయుం దాయాయుద్యోగులు, సేవకులు, నప్రమత్తులై మెలంగు నట్లును, దగు కట్టుబాటులఁ జేయుటయేగాక, వ్యవధిలేనందున రాజబంధువు లెల్లఱకు సకాలములోఁ జేరులాగున శుభలేఖలంపుటయందు వలయు నేర్పాటులఁ గావించి, కరితురగాదిసందోహంబును రాజలాంఛనములగు దిరిసులతోఁ దనలంకరించుట కనువగువార ల నియమించి, మహోత్సవమునకు వలయు మంగళవాద్యకులను, నితరవాద్యకులను, రప్పించి వర్ణవిభేదము లేక సమస్తజనులాహ్వానింపఁబడుట కేర్పాటులఁ జేయించి యీమహోత్సవంబు నట్టి కొఱతలు లేకుండఁజేయు భారమును వహించి, తత్కార్యనిర్వహణంబున కీమాత్రంబును జాగుచేయక పొమ్ము.

సుమం—చిత్తము. సెలవుఁ గైకొని పోయెదను. (నిష్క్రమించును)

దళ—దేవా! పట్టాభిషేక మంటపాలంకారాది కార్యము లొనరింపం చుభారము స్వయముగాఁ బూనుకొంటిని, గావున నేఁటికిఁ గొలువుఁజాలించి పోవుదమా?

పళి—మంచిది. అట్లనే పోవుదము.

(అందఱు నిష్క్రమింతురు)





శ్రీరామచంద్ర.

# పాదుకా పట్టాభిషేకము.

## ద్వితీయాంకము.



### కైకమందిరము.

(ప్రవేశము మంథర)

మంథ—(తనలో) ఏమీ! ఈ పురాలంకార వైభవము. గోడలకు వెల్లలు వేయువారు, జేగురులు పూయువారు, తోరణములు గట్టువారు, కందిళులు వేయుచున్నవారు ఎందులకో? (వినుట నభినయించి) ఈ ప్రజలకోలాహలమేమి! ఆ మంగళవాద్యంబు లెచ్చటవో? ఓ, బ్యాండు లేగాదు, బాకా లేగాదు, తాషా లేగాదు, రండోళ్ళుగాదు, ప్రజలందఱు బరుగులెత్తుచున్నా రెచ్చటికి? నిన్నటి దినమున లేని వైభవము నేడిట్టి కలిగిన దేమి చెప్పుమా! ఈ బండ్లన్నియు వస్తువులను సరఫరా చేయుచున్న దెచ్చటికో? ఆ దేమి! ఆ అరుగులమీదఁ జేరి పెట్టెలలోఁ బాతిపెట్టిన దిరిసులదీసి బాగుచేయుచున్నారు. ఎటు దిలకింతుమన్నను శ్రీహరినామసంకీర్తనంబునఁ దన్మయత్వంబుఁ జెందినవార లేగాన వచ్చుచుండిరే? అసంఖ్యాకములగు దీపములఁ బెట్టి భానుతేజంబును వెల వెలఁ బాఱునట్లు జేయుచున్నారు. తిరుగాఁబంగనా

మంబుల దిద్ది యీ పరుగులెత్తుచున్న సాతానులు తమ కట్టు పంచె లేగతినున్నవో కూడ చూచుకొనకున్నారేమంచె యీయు ద్రవము వచ్చినదో! ఈపాడాపురుల కిది కారణంబని తెలుపు వారొక్కరును గానరారేమి? కొత్తమిరెట్టులవలె. పిలకల నెగరవైచుకొనుచు తమ ఝూరీచెంబులఁ జేతఁ బుచ్చుకొని కోలాహలము చేసికొనుచు నంబిశోందరుగాఁ బోవుచున్నారెం కులకు? (చెవియొగ్గి) ఏమిటా చాటింపు వినదము. ఓరీ! జాఫ రుఁడా ఏమనుచున్నాఁడవు. రామచంద్రయ్యకుఁ బట్టాభిషేక మా? అందులకా? యీకోలాహలములు, యీపటుగులు, యీ యురుకులు, యీభజనలు, యీ మంగళవాద్యంబులు, యీపురా లంకారములు? ఏతావున నెచ్చటవేడుకలైనను నాకన్నులారఁ జూడఁజాలనే? అంకునను శ్రీరామచంద్రుని పట్టాభిషేకము నకు నేనోర్చుగునా? ప్రబలవిరోధియు నాగర్భశత్రువునగు రాముని కింతటి వైభవము జరుగుచుండఁగా నేనా యూరకొ నునది? అదియేమి వైపరీత్యమో గాని రామనామంబు నా చె వులఁ బడినతోడనే నాహృదయంబునఁ గ్రోధాగ్ని ప్రజ్వరిల్లు చుండును. స్వభావసిద్ధముగ నీర్ష్యావేశురాలనగు నేనింతటి వేడుకఁ జూడఁజాల! చూడఁజాల! ముమ్మాటికిని జూడఁజాల ను. చిన్నవాఁడు చేసిన పరాభవమునకుఁ బ్రతీకార మనుకొన నిమ్ము. దుష్టస్వభావనై ప్రతి శుభ కార్యమునకిట్లు విఘ్నమొన రించుచుండు ననుకొననిమ్ము. ఎట్లయినను నేనిప్పు డీకార్య మునకు భంగము చేసి తీఱవలయును. లేనిచో నాయూరు పేరు గూడ మాపుమాయును. కాన నానెచ్చెలియగు కైకేయి నెట్ల యినఁ బ్రోత్సహించి నాయత్నమున సఫలీకృతమనోరథురాల నయ్యెదఁగాక. (ప్రకాశముగా) కైకేయీ! కైకేయీ! పుట్టి

ముసిఁగిపోవుచుండ, హాయిగా నిద్రించుచుంటి నేమమ్మా! లెమ్ము?

కైక—(లేచి తొందరగా) ఏమిమంథరా! ఇప్పుడింత తొందరగా నిద్ర లేపితివి? ఇంకను తెల్లవారినట్టుల లేదే?

మంథ—ఇంకను తెల్లవాఱలేదా? మన జన్మయే తెల్లవాఱినట్లున్నది. నేఁటినుండి మన బ్రతుకముగనా? లే లెమ్ము.

కైక—మంథరా! ఏమి? ఏమి?

మంథ—ఇంకా యేమి యేమనుచున్నావా? నీ కేమైనఁ జెముడువచ్చెనా? విను మా కోలాహలము సొంతులు బ్రద్దలగునట్లు చేయుచున్న ఆ హరినామభజనలు, నానావిధమంగళవాద్యంబులు, ఇల్లు వచ్చి చూడుము. పురమంతయు నెట్లలంకరింపఁబడినదో?

కైక—అవును. ఈహడావుడు లన్నియు నెందులకో?

మంథ—ఎందులకా? రామపట్టాభిషేకమఁట

కైక—మంథరా! నిజముగనే?

మంథ—ఇందబద్ధము కూడనా?

కైక—ఆహా! ఎట్టి శుభవర్తమానము వినఁగలిగితిని?

గీ. సత్యమార్గానువర్తి వి ♦ శారదుండు
సుగుణములఖని రాముఁడే ♦ క్షోణి నేలు
భాగ్య మెన్నాళ్ళకబ్బెఁ బా ♦ వనత జెందె
పీడులీనాఁడు శుభవార్త ♦ వినిన కతన.

మంథ—కైకేయీ! ఎంత తెలివితక్కువదానవమ్మా! రామపట్టాభిషేకవార్త నీవిప్పుడు వినినది. భరతపట్టాభిషేకవార్త గాదు.

కైక—అవును. శ్రీరామచంద్రుని పట్టాభిషేకవార్త యే నేను వినినది.

మంథ—అది నీకు శుభదాయకమా?

కైక—కాదా! విను.

గీ. సర్వ సుగుణాభిరాముఁడు ♦ సార్వభౌముఁ
డగుచు మమ్మేలుచుండఁగా ♦ నంతకన్న
భాగ్య మింకొండుఁ గలుగునే ♦ బడయుమే? సు
ఖంబులను రాము పరిపాల ♦ నంబు క్రింద.

మంథ—ఇంత పిచ్చిదాన వేమమ్మా! రాముఁడే ప్రభువైనచో నీవే మగుదువో గుర్తెఱుంగకున్నావే?

కైక—ఏమగుదును?

మంథ—ఏమగుదువా? దాసివగుదువు. ఎందులకును కొఱమాలిన దాన వగుదువు. ఇంతటినుండి పుట్టింట నుండవలసిన దాన వగుదువు. కౌసల్యాదేవికి పరిచారికగా నుండవలసిన దానవగుదువు.

కైక—మంథరా! ఏమిది? నేఁడిట్టులాడుచుంటివి. నీకేమైన మతి పోయెనా?

మంథ—ముందు రానున్నస్థితిగతుల నెఱుంగక పోవుటయేగాక విూవు మిక్కిలి నాకు మతిపోయిన దనుచుంటివిగా? పోనిమ్ము. నా మాటల కేమిగాని కైకేయీ! మహారాజునకుఁ గడసారపు భార్యవు. నీవనినఁ బంచప్రాణంబులర్పించుచుండువాఁడుగదా? మూఁడు దినంబులనుండి నిగడపు దాపునకైన వచ్చెనా? చెప్పు?

కైక—అందులకుఁ గారణమేమిగా నూహింతువు?

మంథ—ఏమిగా నూహించెదననినఁ గౌసల్యామహాదేవిమీఁదమక్కు వను వదలలేక నీ మూఁడు దినంబులనుండి యచ్చటనేఁడిష్ట

వేసికొని కూర్చుండుటచేత నాపట్టపుదేవి మాయలోఁబడి యీ కృత్రిమపు టాలోచనముఁ జేయుచుఁ దీఱికలేక, ఆరాణిగారిని యీవిధముగా బహూకరించవలెనని, అవిశనే పంక్తులఁ బడయవలయునని, ఆవిధముగా నిన్ను వంచనఁ జేయవలయునని యీవైపునకు రాకుండె. తెలిసినదా?

కైక—ఆమెయుం దెక్కువ మక్కువఁ జూపుచు మనవైపునకు రాకుండుటచే మనల నగౌరవపరచినట్లుఁ దలంచవచ్చు ననుకొనుము. రామపట్టాభిషేకవార్త మనకు వంచన మగుటెట్లు? రాముఁడు సుగుణాభిరాముఁడు. జ్యేష్ఠసుతుఁడు. మునిపూజితుఁడు. వినయవివేకశీలుఁడు. దైవభక్తిపరాయణుఁడు. సూనృతవచస్కుఁడు అట్టివాఁడు రాజగుట సర్వజన సమ్మతమే యగునుగదా? విరోధివర్గముకూడ నాతని రాజతిలకము నే కోరుచుందురు.

మంథ—అవును. ఇన్ని విశేషములుగలిగిన వాఁడగుటచేతనే కాఁబోలు కన్నుమిన్నుఁ గానక నన్నుఁ జావమోదఁ బండితజ్ఞు లందఱది యొక పెద్ద లోపముగాదని, రాముని సుగుణసంపత్తికది యొక లోపకారణ మగునని యీప్రస్తావనయే రానీయక వాఁడే దైవతుల్యుఁడని పొగడఁజొచ్చి యీమహారాజువెనుకఁ జేరి తాళము వేయుట మొదలు పెట్టిరి. అహా! రాముని శాంతము, రాముని వినయత్వము, ఏమని వర్ణింతును?

కైక—ఏమిటీ! రాముఁడా? నిన్నా? తన్నినా? ఎంతమాట! ఒక్కనాఁడేని చెప్పవైతివి? పోనిమ్ము. మంథరా! తన్నినాఁడనియే యనుకొందము!

గీ. కాలుఁదాటను; ఆటాడు ♦ వేళయందుఁ
దగిలెనేమొ పదంబు, రా ♦ ద్ధాంతమేల

దానికెంతగ నంతమా ♦ త్రాన రాము
కైకఁ గడను వహియింప ♦ భావ్యమగునె ?

మంథ—అవునమ్మా! అవును. నీవు మీవారిమాటలు మాటాడక నావలెమూగ నెట్లుందువు ? ఏమో ! ఒకయూరిలోఁ బుట్టి యొక్కచోఁ బాలుఁ ద్రావినవార మగుటచేత నామాత్రమైన నభిమాన ముండకుండునాయని యనుకొంటిని గాని నీవింత దానవా? ఎవరి కడుపులో నేమి యున్నదో యెవ్వరు చెప్పఁగలరు ?

కైక—ఓసి పిచ్చిదానా ! అజ్ఞానదశయం దట్లొనరించినాఁడేమో యంటినిగాని రాముఁ డొనర్చినది లోపము గాదంటినా? చేసిన లోపము చిన్నదగుటచే నింతటి కార్పణ్యము వహించుట మనకుఁ దగునా ?

మంథ—కార్పణ్యము వహించి రాముని కొట్టుమనిగాని, తిట్టుమని గాని, బాధపెట్టుమనిగాని, వధించుమనిగాని, చెప్పలేదు. నేఁ జెప్పఁబోవునది నీబాగుకొఱకేగాని నాయొడిలోనేమో గురియింతువనిగాని, సిరిసంపదలు వచ్చిపడునని గాని తలంచలేదులే !

కైక—మంథరా! అంత కోపమెందులకు ? నాబాగుకొఱకు నీవు చెప్పఁదలంచినదేమో చెప్పుము?

మంథ—ఆ రాముఁడు రాజైనప్పుడు మన దశలు తొలంగునని చెప్పుచుంటిని. అవలకే పైచూపులు చూచుచున్న కౌసల్య మన నెత్తిపై నెక్కి కీలుబొమ్మల నాడించినరీతి నాడింపఁ గలదు. భరతుఁడు గుఱ్ఱములను గాయవలసి వచ్చును. పోనిమ్ము; దీని కేమిగాని కైకేయీ! యివన్ని యటుంచుము? కడసారపు భార్యవని యనురాగము లాలించునీభర్త, సదా నీపదధ్యాన

మే నకలమ్మని నమ్మి చరించు నీభర్త, నీనామస్మరణమాత్రముననే యుబ్బి తబ్బిబ్బై నొసలెఱుఁగక గంతులిడుచు లొట్టలువేయు నీభర్త, నీముఖారవిందమును దిలకించినంతనే చంక లెగఱవేయు నీభర్త, మూఁడుదినంబులనుండి మనచాయకు రాకపోఁగా పోనీ! రేపు శ్రీరాముని పట్టాభిషేకము జరుగఁ బోవుచున్నది. దీనికై యేమందువని నిన్నడుగుట కేనినైనఁ బంపె నా? అదిగాక మేనమామలయింట నుండ్గనున్న భరత, శత్రుఘ్నులఁ దీసికొనిరమ్మనియైన నెవరినైనఁ బంపెనా? మీ గోడ వయ్యే తలపెట్టఁడయ్యె. మీగుమ్మముఛాయకే రాఁడయ్యె. ఇది యెట్లని ఆలోచింపఁడయ్యె! ఇన్ని విధములగు వంచనములు జరుగుచున్నను మహారాజునకు నా మీఁద మక్కువ పొందని దిక్తటములు మాఱుమ్రోగునట్లు పలికెదవు? ఏమి ప్రయోజనము!

కైక — మంథరా! పాప మా మహారాజు కౌటిల్యకపటంబుల నెఱుంగఁడు. కౌసల్యాప్రబోధితుఁడగుటయే యిట్టి విపరీతచేష్టలకుఁ బాలగుట తటస్థించుచున్నది. ఏసంగతులెట్లున్ననుశ్రీరామచంద్రుని పట్టాభిషేకవార్త నాతోఁ జెప్పనే గాదందువా? నేనేమని యడ్డుపడుదునా? తన మహదైశ్వర్యములు నాకుఁ గట్టిపెట్టుమనుచుంటినా? రామభద్రునిమీఁద నాకేమని పగయా? అట్టి దుర్బుద్ధులు నాకు లేవే? నిజముగాఁ గౌసల్యకు నావిషయమున దురభిప్రాయము గలదుసుమా?

మంథ — ఓ! కేకయరాజపుత్రీ! మహారాజు ఏపాపమెఱుంగఁడనుట నిశ్చయమేగాని యీపట్టాభిషేకప్రయత్నములు చాలకాలమునుండియే జరుగుచున్నట్లద్దమువలెఁ గనఁబడుచుండఁగా ఒక్క నాఁడైన నీతోఁ సంప్రదించెనా? మీయిర్వుర కేకాంతప్రదేశము

దోఁచినదిగాదా ? ఈ విషయమునుగూర్చి యేమాత్రమును
దెలియనీయరాదా? అవతలఁ గౌసల్యాదేవిగారియాజ్ఞయైయుం
డఁగా నీకుఁ దెలియదమేవా? ఈవిషయలన్నియు నిట్లుండఁబట్టి
యే తమ ప్రియత్నముల కంతరాయంబు వాటిల్లునని భరత,
శత్రుఘ్నుల నిటనుండి వెడలఁజంపినది. తెలిసినదా? లేనిచోఁ
గాలవ్యవధి లేకుండ, కొడుకులు చెంత లేకుండ, యేమంతముంచు
కొని పోయినదని యింత త్వరితముగ లగ్నము పెట్టించవలసి
వచ్చినది చెప్పుము?

కైక—ఇదంతయుఁ గౌసల్యాదేవి ప్రోత్సాహముననే జరిగియుండునని
దలంచెదవా ?

మంథ—ఆహా! నిస్సంశయముగా ?

కైక—మంథరా! రాజెంతటి మూర్ఖుఁడై పోయెను ? మన మిప్పుడేమి
చేయుదము ?

మంథ—మనమా ! రామపట్టాభిషేకమునకు విఘ్నంబుగల్గింపవలెను.
భరతుని రాజుగఁ జేయించవలెను. ఇంత వెర్రిదానవేమి. చిన్న
తనంబుననుండి చేతులమీఁదుగఁ బెంచిన భరతుఁ డొకరిక్రింద
సేవకుండై చాకిరిచేయుచుండఁగా స్వభావసిద్ధముగ నేయాప్త
వేశురాల నగు నేనుజూచి యోర్వఁగలనా ?

కైక—మంథరా ! ఏమి యజ్ఞానురాలవైతివి? ఇది యెంతైన స్వార్థ
మైన విషయమా ?

గీ. సవతిపైఁ గోపమున; రాజు • సల్పుచున్న
కార్యములయందు నీర్ష్యను • ఘనచరిత్ర

శ్రీరఘూత్తము పట్టాభి ♦ షేకమునకు
భంగ మొనరింపఁ దలచుట ♦ పాడియగునె?

ఇంకియు,

సీ. గాధేయుసవన దీ ♦ క్షనుఁ బ్రోచి వాని యా
శీస్సుల, బడసిన ♦ శీలుఁడతఁడు
పతిశాపవశమున ♦ గతిలేకయున్న య
హల్యనుఁ బ్రోచిన ♦ యార్యుఁడతఁడు
శివధనుస్సును రెండు ♦ జేసి జానకిఁ జెట్టఁ
బట్టిన జగదేక ♦ జెట్టియతఁడు
పరశురాముని నోటుఁ ♦ బరచి సాహస, విక్ర
మంబును జాటిన ♦ మాన్యుఁడతఁడు

గీ. అట్టిశ్రీరాముపుండు తేఁ ♦ డగుటఁజూచి
సంతసింపనివారలీ ♦ జగతినెవరు
గలరు? నేనట్టిచో రాము ♦ కార్యమునకు
భగ్న మొనరింప నవ్వుల ♦ పాలుగానె?
అదియుంతయు నట్లుండనిమ్ము!

చ. భరతునికంటె నెక్కుడగు ♦ భక్తి నిజాప్రచునా యెడన్ నిరం
తరముఁ జరించు నాసుగుణ ♦ ధాముని రాముని పట్టభంగ మొ
క్కరణి నొనర్పనేరుతు న ♦ ఇంబుగ నుండిన కాలుఁ బ్రొంపిలో
నిరుకఁగ నీయుమంచు వచి ♦ యించెద నెంతటి మూర్ఖచిత్తనో?

మంథ—పోనిమ్ము. నాకేమి? కౌసల్యాదేవి రాజమాతగా నుండుటకును, రాముఁడు రాజుగానుండుటకును, నీవునీకొమారునితోఁ గూడ దాస్యవృత్తిలో నుండుటకును, నీవిష్టపడుచుండఁగా నానుకండియులాగున మధ్య నాకేమి? ఏమో! బాల్యస్నేహముచేత,

ముందు ముందు మీకు రానున్న దీనదశఁ జూడఁజాలక నింతవఱకుఁ జెప్పితిని గాని లేనిచోఁ గంఠశోషణము నాకేమిటే! నేనింకఁ బోయెదను. ఇంతదనుక నెత్తిని నోరుబెట్టుకొని వాగినందులకు యజ్ఞానురాలని, మూర్ఖచిత్తనని, రెండు తాపులు తగిలించితివిగదా? ఇఁకఁ జాలును. గర్వప్రాయశ్చిత్తమైనది.

కైక—మంధరా! నాపై నీకంత క్రోధమేల? కాని మనమిప్పుడీ పట్టాభిషేకమునకు విఘ్నమొనరించు విధానమెట్లు? రామునకుఁ గట్టనున్న పట్టమును భరతునకు గట్టుమన్నచో రాజంగీకరించునా?

మంధ—నాకుఁ గోపము వచ్చినది గదా యని నీవేమియు నామాట విననక్కఱలేదు. సర్వదా నీమేలుఁ గోరుదాననగుటచే నట్లొనర్చుట బాగుండునని సలహా పూర్వకముగ నంటిని.

కైక—కాదు. నీ చెప్పు చేతలలో మెలంగెదను. నీవేమి యొనర్పుమన్న నదియే యొనర్చెదను. తద్విధానమేమో చెప్పుము?

మంధ—ఊరక వాగ్ప్రియమేమో?

కైక—అట్లెన్నఁడును జరుగదులే

మంధ—అట్లయినచో వినుము. తొల్లి శంబరాసుర యుద్ధమున నీవు నీమగనికిఁ దోడైనప్పుడు నీకిచ్చిన వరద్వయంబును సమయము వచ్చినప్పుడు కోరుకొనెదనని రాజుకడ దాచుకొంటివిగదా?

కైక—మంధరా! నీకెంతటి జ్ఞాపకశక్తియున్నదే. అబ్బా! యెప్పటి యుద్ధము! ఎప్పటికథ? అవును. ఆవరంబు లిప్పుడేరీతి నుపయోగ పరచుకొందము?

మంధ—భరతు పట్టాభిషేకము. రాము వనవాసము.

కైక—రామునకు వనవాసమేల?

మంథ—జ్యేష్ఠత్వ మీమాంసలేకుండఁ జేయుటకు.

కైక—మహారాజందుల కంగీకరించునా?

మంథ—అదే గొప్పచిక్కు, నీసమర్థతచేత, నీతెలివితేటల చేత, నీబు ద్ధిసూక్ష్మముచేత, నీసరసవాఙ్మాధుర్యముచేత, నియుఖచానై పుణ్యముచేత నీదివ్యాంబరభూషణాలంకార వైభవముచేత మ హారాజును మెప్పించి లాలించి యొప్పించవలయును.

కైక—మంథరా! నేనేమన్నను నీకుఁ గోపమువచ్చునుగాని భరత రాజ్యాభిషేకమునకుఁ జిత్తము సమ్మతించినను రామువనవా సమునకు మాత్రము జిత్తము సమ్మతింపకున్నదిసుమా?

మంథ—అదే తెలివితక్కువ. భరతునకు రాజ్యమిప్పింపఁ దలఁచుకొన్నచో రాముఁడుండిన మనయాట లెంతమాత్రమును సాగవు. ప్రజా మోదమును బొందజాలము. శాస్త్రమంగీకరింపదు. కాన ప ట్టాభిషేక విషయమెట్లుండినను మన ప్రయత్నములకు ముందు రామువనవాస మవశ్యకర్తవ్యము.

కైక—మంథరా! నిజమే. అట్లయిననో నీకొప్పర్తును. నేనిప్పుడే యీయలంకారములన్నియుఁ దీసివైచి, మలిన వస్త్రధారిణినై, కోపగృహమునఁ జేరి పడవలసిన పాట్లన్నియు శక్తివంచనలేక పడి, సఫలీకృత మనోరథురాల నయ్యెదను.

మంథ—సరి యింకనేమి! నీకొమరుఁడు రాజైనచో నింక మేమగుదను దుమా?

కైక—ఆచతురోక్తులన్నియు నిప్పుడెందులకు లెమ్ము? అంతపనికి వ చ్చినప్పుడు చూచుకొందము. మహారాజు వచ్చువేళయైనది.

నీవింక నీప్రయత్నమును మానుము. అదిగో గాళ్ళచప్పుడుగూడ వినవచ్చుచున్నది. నేనింక నాప్రయత్నములో నుండవలయును.

మంథ — ఏమీ! ఎట్టులీకార్యంబున జయంబుఁ బొందెదవో ఆధారమంతయు నీయందేయున్నది, పోవుచున్నాను.

కైక — అన్నిఁటికిని భగవంతుఁడేకలఁడు. పోయిరమ్మా.

(అందఱు నిష్క్రమింతురు.)

---



# పాదుకాపట్టాభిషేకము.

## తృతీయాంకము.

### కైక మందిరము.

(దశరథుఁడు ప్రవేశము.)

దశ—ఏమి! యీయాశ్చర్యము. నిరతంబును గలకలలాడు నీప్రాసాదంబు నేఁడేల కళావిహీనముగ నున్నది? ఇందెవ్వరును గానరాకున్నారు! పరిచారికలుఁ గూడఁ గానరాకున్నారే? కారణంబేమి చెపుమా! నాయడుగుల జాడవినవచ్చినంతనే యెంతయో సంతసంబున నెదురుగావచ్చి సగౌరవముగ, నాదరణపూర్వకముగ, లోనికిఁ గొనిపోయి ముద్దుముచ్చటలఁ జెల్లించు నాయలివేణి, నామురిపెములదొంతి, నారతనాలబంతి, కైకేయి నేడు రాదేమి? పరియాచకమున కెందైన డాగెనేమో? ఓకైకయరాజపుత్రి!

మ. పరిహాసంబునకంచు డాఁగి నను దిప్పల్ ♦ బెట్టఁగానేల? వే
గిరముగా వచ్చి కవుంగిలించి నను నీ ♦ కెంగంట వీక్షింపవే
సరసోక్తుల్ బచరింపవచ్చు; ఝుడిపిం ♦ చఁగవచ్చునిందుండి యి
క్కరణిన్ దవ్వులడాగికొన్న కనుఁగోఁ ♦ గాశక్యమే నాకికన్.

మఱియు,

మ. పరువెత్తందగుదార్ఢ్యమూ పమసెన ◆ బ్జాతాక్షి యేమూలఁ గి
క్కూరుమన్ నాదములేక డాగితివొ? కిజం ◆ కుఁగొంకులేకుండమం
దిరమం దుంటివా? లేక యీవనమునం ◆ దే డాగితో? నిన్గన
ద్వర పెట్టన్ దొడఁగెన్ మనంబుఁ బ్రియకాం ◆ తా! లేదిరారమ్మికన్.

(మందిరంబులోనికిఁ బోవుచుండఁగనే గుమ్మముకడ నేలఁ బడియున్న కైకేయిని జూచి) అఁ అఁ కైకేయీ! కైకేయీ! ఏమి యీవిపరీతము? ఈరూపమేమి? ఈవస్త్రమేమి? ఈరా నేలపైఁ బరుండుటేమి? కురుల విరియఁ బోసికొని, భూషణ రాజంబులన్నియుఁ దీసివైచి, మలిన వస్త్రధారిణివై యీగతిఁ బడియుండుటఁ జూడ నేదియో గొప్ప విశేషకారణ మున్నట్టు లగపడుచున్నయది. (ముఖముఁ బరికించి) ఈమొగంబునఁ గ్రోధంబు తాండవంబాడుచున్నయది. కారణంబేమి చెపుమా! కైకేయీ! పలుకవేమి (మఱింత దగ్గఱకుఁ జేరి) ప్రేయసీ!

మ. కనులన్ విప్పుము నీమనోహరుఁడఁ బ్రి ◆ యం గంటన్ విలోకించి భూ
షణరాజంబుల వీడుచున్ మలిన వ ◆ స్త్రంబాకృతిన్ దాల్చి నే
లను బన్నుండియుఁ గ్రోధచిత్తవగుటే ◆ లా? దెల్పు నా చిత్తమం
దున సంతోషము గూర్చుచేని వడిదీ ◆ ర్తున్ నీమనోభీష్టమున్.

తరుణీమణీ! లేలెమ్ము! నాపంచప్రాణంబులను నీయధీనం బందుంచి సకలంబు నీవయే యని నమ్మికొని చరించు యీ దాసుఁడిత్తతి నీక్రోధం బుపసంహరింపవయేని దాళఁజాలఁడు! తాళఁజాలఁడు!

చ. సవతులు నిన్నుఁ జూచి పరి ♦ హసంబగు మాటలనాడిరో ? తనూ
భవుని నిమిత్తమై భటులఁ ♦ బంపఁగ లేదని యల్కఁ బూనితో ?
భవనము వంకరాక యని ♦ పాటలలోన మునింగి తేఁచు నో
యువిదరో! కోపమూనితివొ? ♦ యున్నదియున్నటులన్ వచింపుమా.

నీవే నా ప్రాణమానధనంబులనియు, నీకీయకారణకోపంబు దగదనియు దగ్గఱఁ జేరి యన్ని తెఱంగుల వేఁడుకొనుచుండఁగా మునుఁగుఁ దీయక, మూతిబిగించుకఁ బరుండ ధర్మము కాదు.

(అని మునుఁగుఁ దీయుచుండఁ గైకేయి విదలించుకొనును.)

శా. నాకర్మంబిప్పుడేమి కాలినది కాం ♦ తా! నాదు చిత్తంబునన్
దీకాందఁగఁ జేసి యిట్టులఁ బరీ ♦ హుంకంగనుం దానున
నీకోర్కుల్ నెఱవేర్తునంచు దెలుపన్ ♦ నీకింత పంతంబె ? అ
య్యో! కైకేయి క్షమింపుమింక ననున ♦ త్యుత్సాహ సంప్రీతితో.

కైక—(దిఢాలున లేచి) ఆపాపిష్ఠివిధాత నాలలాటంబున లిఖించిన వ్రాతకు నాలోనేను విలపించుచుండఁగా నానుకండియలాగున మధ్యవచ్చి మదోన్మత్త వాక్యంబులాడి నావిచారమును మఱింత వృద్ధిపఱచు మంటివేమి ? నీకర్మమేమియుఁ గాలలేదు. నీపైఁ గ్రోధము వహించునంతటి సమర్థతఁ గలదాననుగాను. సవతుల నిరసన వాక్యంబులతోడ నాకేమిపని ? నీవిప్పు డిచ్చటి కేల వచ్చితివి ? ఎవరికర్మము వారేయనుభవింతురు. ఈవృథాలాపము లేల ? ఈస్తోత్రపాఠము లేల ? ఈవినయ వేషము లేల? ఏటికీ యక్కఱకురాని చేష్టలు ?

దశ—ప్రాణేశ్వరీ !

కైక—అబ్బా! ఏమీ యీసంబోధనము? నాభిదగ్గరనుండి వచ్చినవాక్యమే నాకిచాలుఁజాలు. ఊరకొనుము. విన్నవారు పరిహాసింతురు.

దశ—లోకుల కగోచరములకు వెలచి నాయనురాగముల కుప్పవైన నీపైని వాత్సల్యమును దిగఁద్రాగుదునా? నీదాస్యము మఱతునా? నాసుఖంబులఁ ద్యజింతునా? ఏటికీవిరసోక్తులు?

కైక—అవునవును! నావి విరసోక్తులా. నీవి సరసోక్తులు. ఏమి సరస మాడిపోవుచున్నది? నీవు పురుషుఁడవా? నేను స్త్రీనా? నాకు నీవు పతివా? నీకు నేను సతినా? ఆదినములు వేఱు. ఈదినములు వేఱు! ఎందులకు నన్ను వృథావాగింపఁ జేతువు?

దశ—కైకేయీ? నేడిట్టుల విపరీతముగ మాటలాడుచుంటివేమి కారణము చెప్పు? ఆవఱలో నెన్నఁడైన నన్నట్టిచిన్న చూపుఁజూచి యెఱుంగుదువా? నీవెట్టులాడుమనిన నట్టులనేయాడితిని. నిలువుమన్న తావున నిలిచితిని. ఏది చేయుమన్న నదియే చేసితిని గదా? అట్టివాఁడనగు నేనిప్పుడేమి విరుద్ధముగాఁ బ్రవర్తించితి నని యీయాగ్రహము?

కైక—ఈ సరసోక్తులన్నియు నిమూఁడు దినంబులనుండియు. బట్టపురాణి గారియొద్ద నేర్చుకొంటివా? నన్ను సమాధానపరచుట కివియన్నియు నేర్పించెనేమి? పాపమామె నాయొద్ద కేలఁ బంపును? మఱి సిద్ధిమతిఁజెంది యిదియే కౌసల్యాదేవిగారి యంతఃపురం బని త్రోవదప్పి వచ్చితివి. పరిచారికను దోడొసంగెదను గాని కౌసల్యదగ్గఱకుం బొమ్ము!

దశ—

ఉ. నేరము నర్పనైతిఁ దరు ♦ ణీమణి నీయెడ నుంత యేని, యీ
తీరున వాదరాదు ననుఁ ♦ దియ్యని పల్కులతోడ నీదగుం
గోరిక దెల్పుదేని వడిఁ ♦ గూర్తును; దీర్తును నీదువాంఛ నీ
నీ రసవాక్యజాలమిఁక నిల్పుము ♦ దాల్పుము శాంతముఁగ మదిన్.

కైక—ఈస్వప్రవచనంబుల కేమి లెమ్ము ? మా కేమి వాఫలుండును ? ఆ వరములు, ఆలాంఛనంబులు, ఆముద్దులు. ఆముచ్చటలు మా కెందులకు ? కౌసల్యాదేవిగారన్న అమ్మగన్న బిడ్డయగుటచే నావిడకే దీర్పుఁడు.

దశ—కైకేయీ ? అట్లఁకుము. నీవ్రిసంగధోరణినిట్టి చూడ నీవే మా నన్ను గోరినట్లు, నేను నెఱవేర్పనట్లుగను దోచుచున్నది? ఏమని నన్ను గోరితివా ? నేను కాదంటినా ? నీకు వాగ్దానమొసంగి నీముద్దుముచ్చటలఁ జెల్లింపనైతినా ? నీవిషయమై యెన్నఁడేని యనృతము లాడితినా ? చెప్పుము? ఏల యీనిష్ఠురాలాపములు ?

కైక—అవును ? కోరుకొన్నవన్నియు నెఱవేర్చువారలు, ఆడితప్పకుంగనివారు, జ్ఞాపకము లేదా ? మొన్న మొన్న జరిగిన విషయము ?

దశ—నేనా ? అనృతమాడినది, నీవిషయమేనా ?

కైక—ఇతరుల విషయమైనచో నబద్ధమాడుదురు కాఁబోలు ?

దశ—దేవి ! ఎందులకట్లనెదవు ?

గీ. పావనంబైన యిక్ష్వాకు ♦ వంశమందు
జననమందిన వారల ♦ సత్యమున్న
ముఁడిపడెదరు సుమ్మి యీ ♦ మాడ్కి నేల
పాపములకోడిఁగట్టంగఁ ♦ బాల్పడెదవు.

అదియట్లుండనిమ్ము నిన్న మొన్ననే జరిగిన యంశమునుగూర్చిమరచితివా యంటివి. ఆవిషయమెద్దియో దెల్పుము?

కైక—నేను దెల్పవలయునా ? జ్ఞాపకము లేదా ?

బనియుఁ బూర్తిగాఁ దెలియుచున్నది. ఏకొందకాఁగొడుగుపట్టు మీపరివర్తనము సంపూర్తిగాఁ దేటపడినది. ఏఱుదాటి తెప్పఁ దగులవేయు మీరఘువంశజుల నైజస్వభావము సంపూర్ణముగ బోధపడినది. నేను కోరుకొన నక్కఱలేదు. మీరీయనక్కఱ యుండాలేదు. ఎట్లయితేనేమి.

దశరథుఁడు సత్యసంధుఁడు ♦ దక్షుఁడోడు
నోటితో నన్నదాని య ♦ న్నాటజగతి
నిలుపుకొననెంచి మెలఁగు నీ ♦ నేర్పుఁజూచి
సంతసించుచు నున్నారు ♦ జనులు రాజ.

అంతియేగాని కడుపులో నెంతటి యూహలున్నవో పరిశీలించినవారేరి ?

దశ — తరుణీమణీ ! నాకు వారివీరి పరిశీలన మెందులకు ? స్వానుభవచిత్తవు నీవు కలవుగదా ? నీయెడ నొనర్చిన దోసమేమున్నదో చెప్పుము ? దిద్దుకొందును. అట్టిదానిని మఱచిపొమ్మని నిన్నుఁ బ్రార్థించుకొందును. పిచ్చిదానా ! వెఱ్ఱివానిని జేసి వృథాకాలక్షేపమొనర్చి నన్నాడింపఁ జాతువుగాని నీకుమాత్రము నాపైఁ గోపమా ? ఏదియో అకారణ మట్టిదగుట నట్లువికృతాకారమున గానుపించితివి. చెప్పుము. నీకేమి కావలయునో?

గీ. రత్నహారంబులో లేక ♦ నూత్నములగు
జిలుగువలువలో; మేడలో ! ♦ బలురకముల
హయములో, కరులో, గోరు ♦ మబల వేగ
దెల్పుమవయేసి నీకోర్కెఁ ♦ దీర్పువాఁడ.

కైక — వీటిలో నేవితక్కువగానున్నవని నేకోరుకొనవలయును ?

దశ — పోనిమ్ము; ఇవికాకున్న నీయిచ్చవచ్చినవి కోరుకొనుము.

కైక — కోరుకొనినచో మీరొకసమ్మతము లైన నానోటి వెలితియేగదా?

దశ — సుందరీ! అటులెన్నటికిని దలంపకుము,

గీ. ధనముపోయిన, రాజ్యంబు ♦ ధ్వంసమైన
రసికులోద్భవులాడ నే ♦ రరు సుమీ యు
బద్ధములనేల యాలీల ♦ వాదులాడి
వేదనలముంచ జూతువు ♦ వెలదినీవు?

కైక — అట్టిపగ్గల్భములాడుటపురుషులవారికి నైజస్వభావమే. కాని, నేనోరు
కొనుచు వెట్టకోరికలైనను దేవా! తీర్చుటకు సంసిద్ధులైయున్నా
రుగదా?

దశ — దేవీ! ఇంకేటి యనుమానము.

మ. భవదీయంబగు వాంఛలన్నిటిని దీ ♦ ర్పంగంకణంబూని రా
ఘవుపై నొట్టును బెట్టు కొంటినిగదా ♦ నా! వైరమే శాంతచి
త్తపునైకంకర్యజాచిక్కుల్గుము భవ ♦ ద్వాంఛల్ వదల్ దీర్చెదన్
రవివంశంబున ఖ్యాతిగాంతు జెలువా ♦ రన్ జేయుమీ సన్నుతల్.

కైక — నాథా! అంతయొట్టును బెట్టుకొంటిరిగాన నాకోరికలు దెల్పు
కొందును. మిమ్మోట నన్ను నపరాధవము చేయువలదనుసుమీ!
అయినను హృదయేశ్వరా! నేను నూతనముగానిప్పుడు కోరు
కొననేల? నాకిదివరకే రెండువరంబుల నిచ్చియున్నారుగదా?

దశ — ఎప్పుడు?

కైక — ఎప్పుడా! మఱచితిరా? నాథా!

గీ. శంబరాసురునకు మీకు ♦ జరిగినట్టి
సమరమందున నేదోషు ♦ వడగనాకు
వరములను రెంటినొసగ నే ♦ వలసినపుడు
కోరుకొనుటన పరెయని ♦ మీరలనరె?

దశ—ఎంత మాటనవే? కైకేయీ! ఆనాఁడు యుద్ధమునప్పుడిచ్చితివా? ఎన్నఁడో జరిగిన విషయమును వార్ధక్యదశ ననుభవించుచున్న నాకు జ్ఞాపకముండునట్లు చెప్పుము?

కైక—చమత్కార వచనరచనలకును, సరసములకును, బ్రతిమాలుకొనుటకును, లేని వార్ధక్యత ప్రాతవిషయముల జ్ఞప్తిఁదెచ్చుకొనుటలో నడ్డువచ్చును గాఁబోలు.

దశ—ఈమాటల కేమి లెమ్ము. ఆరెండు వరములేవియో యిప్పుడు కోరుకొనుము. నావలనఁ గైకొనుము. ఇంతమాత్రమునకు,

గీ. కురులు విరబోసికొని పాత ♦ గుడ్డనొకటి
కట్టి, నగలనుదీసి చే ♦ కాకికింత
లేక రానేల బడుకొని ♦ యీకరణిని
క్రోధచిత్తవుగానేల ? కోమలాంగి.

మూతి బిగించితివి. ముసుఁగుఁ బెట్టితివి కనుబొమ్మలుముడి వైచితివి. ముసుఁగు దీయఁబోవ విదలించివైచితివి. నేను రానా? నీమనోవాంఛ లరయనా? నను గట్టికొని నీ కోర్కె లీడేర్పనా? ఇంతలోనేమి పుట్టిమునిఁగి పోయినదని నీ వాయాసపడితివి? నన్నేల యాయాసపెట్టితివి?

కైక—కోరుకొనుమని వృథాపలుకుట దగదుసుమా? నాథా! శ్రీరామమూర్తిపై నొట్టుఁ బెట్టుకొని ప్రమాణమొనర్చితివి. జ్ఞప్తియున్నదా?

దశ—(తనలో) ఇంత గ్రుచ్చిగ్రుచ్చి యడుగుచున్న దెట్టికోరికలఁ గోరునోగదా? ఏమైనను సరియే; గడచినదాని కేమి చేయఁగలను? విధికృత మెట్లున్నదో అట్లే కాఁగలదు. (ప్ర) ప్రేయసీ! జ్ఞప్తియున్నది.

కైక—నాథా!

గీ. వరుసఁ బదునాలు గేడులు ♦ వనములందు
వాసమొనరింపఁగా రాము ♦ బద్రుఁబంపి
భరతునకుఁ బట్టముఁ గట్ట ♦ వలయునివియె
కోరుకొంటిని వేగంబ ♦ కూర్పుమయ్య.

దశ—ఆఁ ఆఁ సుందరీ! ఏమంటివి? ఏమంటివి?

కైక—వినఁబడలేదా? పట్టాభిషేకప్రయత్నంబులు భరతున కుపయోగపరచి శ్రీరామచంద్రుని పదునాలుగేడు లరణ్యంబులకుఁ బంపుమంటిని.

దశ—హా! కైకా! రామునా! వనవాసమునకా? బంపుమంటివి. హరిహరీ! ఎంతదారుణవార్త వినఁగల్గితిని హా! రామా! సకలసద్గుణాకర ధామా?

మ. కలనే గంటినొ? లేక నిక్కమగునో? ♦ కైకేయి యిట్లాడెనో?
కలుషాత్ముండనునై చరించితినొ యే ♦ జ్ఞానాబ్ధిలో మున్గి యా
కులపాటందుచు నేభ్రమించితినో? యా ♦ ఘోరంపువాక్యంబులె
ట్టుల నావీనులసోకెనో దెలియుటె ♦ ట్లో తోచదయ్యెంగదా?

దేవీ! చిత్తవిభ్రమము నొంది యిట్లాడితివా? లేక నిజముగనే బలుకుచుంటివా? నీవేమి? రాము నేమి? యిట్టి ఘోర శిక్ష పాల్జేయుటేమి?

ఉ. నీకరుణాకటాక్షమున ♦ నే జరియించెడు రామచంద్రు, లో
కైకనుత ప్రశిష్టుని, స ♦ గర్వశిరోమణిన్, వివేకు, నన్
జీకునమునుంచి కానను వ ♦ సింపఁగఁ బొమ్మన నెట్లులాడెదో
కేకయరాజపుత్రి! పరి ♦ కింపుము వానిని నీమనఃకృపన్.

కైక— మీరు కలఁగవలదు. కోరుకొనినవరంబుల నొసంగదనని మీవలనఁ బ్రమాణములఁ గైకొని మీకడ దాచుకొనిన వరద్వయంబులఁ గోరుకొనఁగా మీకీ విచారమేటికి? మీరేమి యజ్ఞానులా? అసత్యాలాపకులా? కన్నులకు గంతలుకట్టితిమా? మొదలు విరచితిమా? మీరు కోరుకొమ్మంటిరి, నేను కోరుకొంటిని. భానుకులప్రదీపకులని పేర్గాంచినందులకుఁ దోడు మీ సత్యదీక్షం గాపాడుకొనఁ దలంచితిరా నాకోర్కెలనెల్ల నేర్పుఁడు. లేదా నేనీయననుఁడు.

దశ— నేను వరములవిషయ మబద్ధమాడుట లేదే?

గీ. సత్యనిరతుని, శ్రీరామ ♦ చంద్రు ఘోర
విపినములకంపుమని యేను ♦ విమతుకోర్కె
ములుకులుంబోలె నాదు వీ ♦ నులకుదోఁపఁ
గూడదంటిని నీకిట్టి ♦ ఘోరవాంఛ.

కైకేయీ! సర్వగుణ సంపన్నుని, సుగుణములరాసిని, ముద్దుకొమరుని, శ్రీరామమూర్తిని, అయ్యో! పదునాలుగేడులా? విడిచి నేను బ్రతుకఁగలుగుట?

గీ. గడియ గన్పడకున్నచోఁ ♦ గండ్లుపోయి
నట్టువిలపించు నాప్రాణ ♦ మెట్టులోర్చు?
మురిపెములఁగొల్పువాఁడు నా ♦ ముద్దుసుతుఁడు
రామచంద్రుఁడు కాంతార ♦ సీమనుండ.

ప్రేయసీ! నీయిష్టానుసారంబుగ నే పట్టాభిషేకమహోత్సవము భరతునికే గట్టెదను. కాన రెండవకోర్కె మరియొండేదైనఁగోరుము. రామమూర్తిని విడనాడియుండుట మాత్రము కల్ల? నే బ్రతుకఁజాల.

గీ. భీకరారణ్యములకుఁ బం ♦ పించి సుతునిఁ
కందమూలాదులనుతిని ♦ కటికనేలఁ
బవ్వళించుచుఁ బడరాని ♦ పాట్లఁబడుచు
నుండఁజూచుచుఁ బ్రాణమె ♦ ట్లుండునబల!

కైక—నీవు కోరెడుకోరికలు నాకునమ్మకమున్నచో నిచ్చెదనని తొలుత నే వచియించినచో బాగుగానుండెడిదిగదా ? అట్లనుడువ నైతివి ? నానోటినుండి పలుకులన్నియు వెలువడిన పిమ్మట వాటినిఁగూర్చి నీకీపరితాపమేల ? చేయఁదలచుకొన్నచో నేను గోరినరీతిని జేయుము. లేకున్నచో నీకీబాధయంతయు నెందులకు? ఒక్కసారిగా నీవుకోరనూలేదు నేనీయనూలేదనరాదా? అంతమాత్రమున నోటిముత్యములు రాలిపోవునా ?

దశ—హా ! రామచంద్రా ! ఎంతహీనుఁడ నైపోతిని.

గీ. రవికులంబున కెల్ల దు ♦ రంతమైన
మచ్చఁ గల్పించఁ బుట్టి యీ ♦ మాయలాడి
వ్యూహమునఁ జిక్కి నీమీఁద ♦ నొట్టుఁబెట్టి
కాని ప్రమాణముఁ జేసితిఁ ♦ గొంకులేక.

తండ్రి ! ఇంతటి మదాంధకారమా నాకు ? ముందువెనుకల నరయకఁ గోరినరీతి నియభీష్టములీడేర్ప సంసిద్ధుఁడనని వాగ్దానమొనర్చిన యీపరమపాతకుని నీబాణపరంపరచే సంహరింప వేమిరా ? నాయనా !

గీ. తాటకనుసంహరించిన ♦ ధనువు పరశు
రామునోడించినట్టి క ♦ రంబు నాదు
శిరము వ్రక్కలుచేయఁగాఁ ♦ జేవలేక
మూలబడియుండెనే రామ ♦ మూర్తి ! యిప్పుడు.

ఓ కేకయరాజపుత్రీ! నీకింతటి కాఠిన్యత తగదుసుమా ?

చ. భరతునికంటె నెక్కుడుగ ♦ భక్తిని నిన్ భజియించువాని, శాం
తరసముఁ జిల్కువాని గుణ ♦ ధాముని, రాముని వాడు చేతిక
క్కటికయినట్టి వాని నడు ♦ కానవసింపగఁ బొమ్మటంచు నె
క్కటిని వచింపజాలుదువు ♦ కారుణికత్వ మొకింత లేకనుర్.

వనంబులకుఁ బ్రవాస మంపఁదగినంతదోసము లే రాముఁడు నీయెడఁ జేసియున్న యెడల,

గీ. కాటిలోఁ బెట్టుమంచునన్ ♦ గోరరాదె ?
వేఱుగానుంచమని నన్ను ♦ వేడరాదె ?
కనులతో నేనిఁజూచుకఁ ♦ గడపుచుందు
వాఁడఁగాలంబుఁ గాంతార ♦ వాసమేల.

అదియిదియేల? అట్టిదోషంబుల సైరింపుమని వయసునఁ బె
ద్దవాఁడనైనను రాఘవునకు మారుగా నీపాదంబులపై వ్రాలె
దను క్షమింపుము. (అనిపడబోవును.)

కైక—నీకేమైనఁ బిచ్చిపట్టినదా యేమి ?

దశ—నిజముగ నేఁ బిచ్చిపట్టినది ! లేకున్న చో ?

గీ. ఇంగితజ్ఞానమొకయింత ♦ యేని లేక
నిన్నుఁ బ్రాల్మాలుటకటంచు ♦ కన్నుఁ గాన
కుండఁ దబ్బిబ్బులైపోయి ♦ ఘోరమైన
శాస్తిగావింతు నోక్కైక మా ♦ పాబ్ధిమునిఁగి.

కైకా ! నీవంతటి వజ్రకాఠిన్యహృదయురాలవని తెలిసికొ
నలేకపోతినిగదా? అనుగుణశీలుని రూపరేఖావిలాసంబుఁ గాం
చినఁ గటికవాఁడైనను గన్నీరు మున్నీరుగా విలపించునే ?
నీకేలవానిపై నీయకారణవైషమ్యము ? నీకోరికరీతిని రాజ్యం

బంతయు భరతునికే యిచ్చెద. పోనిమ్ము; రాముఁడాతనికడ సేవకుఁడై యుండుటకేనిఁ దగఁడా? అట్టి దశలోనుండినను గన్నులారఁ జూచుకొందునే? (రాము నుద్దేశించి)హా! రామా! నీకెంతటి యవస్థ వచ్చినదిరా? తండ్రీ!

సీ॥ నీలమేఘశ్యామ! ♦ నినుఁబాసి పదునాలు
గేడు లెట్లుండెడి ♦ వాఁడ ధరణి
రఘుకులాంబుధిసోమ! ♦ ఘనదీనవనవాస
మును జూచుచెట్లుఁ ♦ బొగలుచుందు
సర్వవిజితకామ! ♦ జన్మమంతయు నిట్లు
లేమ్పుతోఁ గడపుట ♦ యెట్లునేను
రణరంగభీమ! యు ♦ గ్రక్రూరమృగముల
తోనుండ నాకెట్లు ♦ తోఁచుచుండు
గీ॥ ధరణి సర్వస్వమేలుచుఁ ♦ దల్లిదండ్రు
లైన మమ్ములఁ గడతేర్చ ♦ నందయగుచుఁ
బురిసెడు జలంబు విడతువా ♦ ముదముగూడ
అంతరించెనె! నేటితో ♦ నయ్యొ రామ?

అయోధ్యాధీశుండవై, అష్టైశ్వర్యములతోఁ దులఁదూగుచు బ్రజాభీష్టం బీడేర్చుచు రఘుకులంబున కింతకీర్తి వ్రతిష్ఠలు దెచ్చెదవనుకొంటిఁగాని, తండ్రీ! నడుకాననంబున, నొంటరివాఁడవై, దిక్కుమొక్కు లేక నల్లాడుచు, మమ్ముల నీరీతి దుఃఖవారాన్నిధిఁ ద్రోతువనుకొంటినా? హా! కలుషాత్మురాలు మంథర చేసిన కుట్రయాయిది? కాకున్నచో సుస్వభావురాలగు యీ కైకేయి స్వయముగ నిట్టి దురేచ్ఛఁ బొందుట వట్టికల్ల. అవును, ఇటుల జరిగి యుండవచ్చును.

గీ॥ రాముపట్టాభిషేకకా ♦ ర్యముల మగ్ను
నగుట నిచ్ఛాయుతైరాని ♦ యట్టి దోస
మొంచుఁగల్పించి ప్రోత్సాహ ♦ మొసఁగి దీని
నీగతికిఁ దెచ్చె మంథర ♦ యేమిసేతు!

(రామునుద్దేశించి) ఓ మదాజ్ఞాపరిపాలనాదీక్షా బద్ధకంకణా! శ్రీరామభద్రా!

ఉ॥ ఎన్నఁడెఱుంగఁ బొమ్మని వ ♦ చించుట, రమ్మని చేరబిల్చి నా
యన్న! వరాలతండ్రియని ♦ యాదరణంబున ముద్దుపెట్టుకొం
చున్నను, మోదమొందెదు గ ♦ దోయికుమార! ధరింపఁజాల నా
పన్నుఁడవై వనంబుల ని ♦ వాసమొనర్పుటఁజూఁచి ప్రాణముల్!

లేక లేకఁ దపించి పరమేశ్వరానుగ్రహంబునఁ బడసిన కుమారుని, గాధేయసవనదీక్షారక్షకుఁడైనకుమారుని, నిటలాక్షు చాపభంజకుఁడైన కుమారుని, పరశురాముగర్వంబు సర్వంబు ఖర్వంబుగా నొనర్చిన కుమారుని, కనకాంబరధరుండై, నీలమేఘశ్యాముఁడై, అఖిలలోకాభిరాముఁడై మురిపెములనింపు కుమారుని, అయ్యో! వనమునకా? సింహశార్దూలాది భీకరమృగంబులు నివసించు వనమునకా? దయాదాక్షిణ్య రహితులగు కిరాతులువసించు వనమునకా? వీక్షించినంతనె గుండెలు వ్రయ్యలగునట్లు భీతినిగల్పించు వనములకా? పంపుట? ఎంత నిర్భాగ్యుఁడను, ఎంత దుర్మార్గుఁడను. ఎంత కాఠిన్యుఁడను. ఎంత ద్రోహుఁడను. అయ్యో! దోషరహితుని, శాంతమూర్తిని, పరమపావనుని, మోమెట్టులఁ జూతును? ఎట్లు జూడకుందును?

గీ॥ పతియలిగె నేఁడు నాకికే ♦ గతియటంచు
దేవెన్నై, మూర్ఛనొందు ప్రా ♦ ర్థించియుంత

ముద్దుగాఁ బెంచుకొన్న రా ◆ ముని, పవిత్ర
చరితుపై నొట్టుఁబెట్టిన ◆ జనకుఁడఁగానె?

అట్టివానికి సిగ్గులుండునా ? ధర్మాధర్మవిచక్షణ ముండునా ? దయాంతఃకరణ ముండునా? ఓసూర్యవంశపావనుఁడా!

శా. నిర్వంశంబు సముద్ధరించుటకు నెం ◆ తేఁ గారణంబైన యీ
భావాతీతుని రామచంద్రుని పయిన్ ◆ వాత్సల్యమున్ వీడి ? యా
హా ! నాపుణ్యంబొనరించఁగా వనులకే ◆ నంపంగ నున్నాఁడనో
దేవా ! రావదియేమి నన్నునుము నీ ◆ దివ్యప్రభావంబునన్.

సీ. వేలకొలఁదిగ వత్సరా ◆ లేలి ధరణి
వందలకొలంది యేండ్లు త ◆ పంబుఁ జేసి
యింతకాలంబు బ్రతికిన ◆ యేని నాకు
చాలదే యాయువిల నర్క ◆ సార్వభౌమ.

(ప్రకాశముగా) కైకేయీ ! కైకేయీ !

కైక—ఎందులకు నన్నుఁ బిలతురు ? తొలుత నియిచ్చివచ్చిన వరంబుల నొసంగెదనని అర్భాటప్రతిజ్ఞ లొనర్చనేల ? ఇప్పుడీ చేతవాతఁగాని బొల్లిబొల్లి యేడ్పులేల? అప్రయోజకుల కార్భాటములు మెండను లోకసామ్యంబు వృథాపోవునే? మీయనుదిగులుచే నట్లంటిరిఁగాబోలు, చాలుఁజాలు. మీరాజవంశ సత్యావధురీణత్వము. మీప్రతిజ్ఞానిర్వాహణపాటవము, మీకిద సింతటి ప్రజ్ఞలున్నవని యెఱుంగియు, మోసపోయి మీమాటల విశ్వసించి వలలోఁబడి, నానోటివెలితి వెలువరించుకొంటిని. పరసార్థకము లేకపోగా కైకేయి పరమ ఛండాలురాలయ్యెనను దుర్గతినందుట గూడ సంభవించె. హా ! దయామయా

ఈ నిర్భాగ్యురాల నేల ప్రిదుకనిచ్చితివి. ఓరాజా! అవునని యో గాదనియో వచింపక నన్నేల యీయాసపెట్టెదవు!

దశ—ఓసీ! క్రూరస్వభావురాలా? ఎంత తెగువగా మాటలాడుచుంటివి? ఎంతటి ఘోరకార్యంబున కుపక్రమించుచుంటివి? ఎంత నిర్దాక్షిణ్యముగఁ బలుకుచుంటివి? నల్లరాతికన్నఁ గాఠిన్యమైన నీమానసముఁ గరగింప నాకుఁ గాదు సరిగదా నన్ను నిర్మించిన యావిరించికేనిఁ దరంబగునే? ఓకఠినాత్మురాలా! నీవు నాపాలిట నెక్కడ దాపరించితివి? రఘువంశోద్ధారకుఁడై, ఆర్తావనదీక్షా పరతంత్రుఁడైన రాఘవుని, ఎదుటివారికి శ్రమనొసంగఁ బ్రాణ్మందిరంబున నెంతయు బరితపించు రాముని మదీయప్రాణనిర్వాహణదక్షుఁడైన రామచంద్రుని యేగతికిఁ దెచ్చుచుంటివే? ఓసీ పాతక! ధర్మశాస్త్రవిరుద్ధంబని యెంచవైతివి. అయ్యో! నలుగురు సహోదరనిజాంకవైతివి. రఘుకుల శిరోభూషణుండగు రామునిజూచి జాలిపడవైతివి. నీవు మానిసివా? ఇక్ష్వాకుకుల పయఃపారావార రాకాసుధాకరుండగు శ్రీరామభద్రుని పాలిట జనించిన శనిగ్రహంబవు. నాపాలిట ఘోరమృత్యుస్వరూపిణివై, నాచేతులకు గాజులు దొడిగించి యాడించుచుంటివి. తుచ్ఛురాలా! స్త్రీహత్యాపాతకము, జన్మజన్మంబులఁ గట్టికుడుపునని యింతదనుక యోజించితిఁ గాని నిన్ను యీవఱకే యీనిశితఖడ్గంబునకు బలియిచ్చి యుందును. సిరిసంపదలను బాసి, సకల బంధువర్గంబును వీడి, అయోధ్యా పురవరంబును విడిచి, భార్యను వదలి, తమ్ముల నీగతి విచారమగ్నులఁ గావించి, యేకాకియై, నీమూలమున భయంకర స్వరూపిణియగు దుర్గాటవిని బ్రవేశింపనున్నాఁడే

రాముఁడు. ఆఘోరారణ్యములో నిదుర పట్టునా? భోజనము
లభించునా? ఆక్రూరమృగంబుల భీకరగర్జనంబుల కాఁక
గలఁడా? దుష్టురాలా! నీకు నోరెటులాడె? నీనాలుక నేల
కున్నదేమి? సుగుణరత్నాకరుండగు రామభద్రుని పిలచిన
నా ప్రాణ వాయువులు నిలువ నేరవని ప్రాల్మాలుకొంటినే?
రఘుకుల తిలకుండగు రామభద్రునకు వేత్రాంకుశితు యేది
దైన సిధించి అయోధ్యాపురంబును పీడకుండఁజేసినాత్రి
మును మాత్రిముజూచి నాకన్నుల గానద మెయనంగుమని
వినయపూర్వకముగా వేడుకొంటినే? అజ్ఞానవశంబున
రాఘవుండేదియైన నీయెడల నపచారంబుఁ గావించినచో వానికి
మాటుగా క్షమింక నిపాదంబులఁ బట్టుకొనెదనని వచించితినే?
ఇంత కావరమా? ఇంత కఠినతయా? నిరతంబును సాధుమృగం
బులఁబట్టి వధించి తదామిష విక్రయంబువలనఁ బొట్టఁబోసికొను
కసాయివాండ్రకన్న వేయిమడుంగు లధికముగు కాఠిన్యము
వహించిన నీశరీర మీ చండాయుధంబునకు మాత్రము లొం
గునా? ఓకుటిలాత్మురాలా!

మ. సుగుణాత్మున్ రఘురాము భీకరవనిన్ ♦ శోకిల్లఁగాఁ బంప నే
మగునో నాగతి యంచు నెంచక మహా ♦ హంకారబుద్ధిన్ నను
బ్రోగులన్ జేసిన నీశరీరమును ని ♦ ప్పున్ బెట్టి కాల్పించినన్
దగులన్ బోవున పాతకంబు నను సుం ♦ తన్ గోముఖవ్యాఘ్రమా,

ఓవయోముఖ విషకుంభమా? రామభద్రుని వనములకం
పి నన్ను రాజుఁజేయుమని భరతుండు వాంఛించునా? ఇక్పుడీ
వార్త వినిన భరతుఁడు నిన్ను బ్రతుకనిచ్చునా?

## పాదుకాపట్టాభిషేకము.

గీ, కండ కండలుగాఁ గోసి ♦ కాక, ఘూక
గృధ్రజాతికిఁ గావించి ♦ తృప్తి యవల
రాఘవుని బ్రాలుమాలి యీ ♦ రాజ్యమునకుఁ
బట్టముఁ గట్టి కోర్కె దీ ♦ ర్పఁదె గాసి.

ఓసీ యవినీతురాలా? భానుకుల వినాశనంబునకుఁ గారణభూతురాలవైన నిన్ను లోకభగవానుఁడైన భానుండైనను దన సహస్రకిరణములచేఁ బట్టి కాల్పఁడా? ఓసీ! రాకాసీ! ఎంత విషపుకోర్కె? ఎంత విషపుకోర్కె? ఎంత దారుణమైన సంగతి!

సీ. తనతమ్ములన్న హృ ♦ దంతరమున నెంతె
రూ మోదమును జెందు ♦ చుండువాఁడు
కులగురువన్న ని ♦ చ్చలు వినయవిధేయుఁ
డై తన ధర్మంబు ♦ లరయువాఁడు
తలితండ్రులన్న సం ♦ తతము భక్తినిజూపి
యెంతరూమోదంబు ♦ నిచ్చువాఁడు
పరులకు సాహాయ్య ♦ పడుట యన్నఁ బ్రమోద
చిత్తుఁడై క్షణములోఁ ♦ జేయువాఁడు
గీ. రాచకార్యాది విషయ మ ♦ ర్మములఁ దన స్వ
శక్తిఁ గ్రహియించి ప్రజలను ♦ భక్తితోడఁ
బాలన మొనర్పఁగాఁగల ♦ వాఁడు రామ
భద్రుఁ డేరీతి నివియన్ని ♦ వదలువాఁడు?

ఓసి దుర్మతి! తగదు. తగదు. ఇట్టి దురేచ్ఛ వదలుము. వదలుము. వదలుము.

కైక—నాకుఁ దగదా? ఇది దురిచ్ఛయా? నాకొసంగిన వరద్వయంబు ను గైకొనుట తగదా? రామచంద్రునిపై నొట్టంటివే? అనృత మాడుట మా యిక్ష్వాకుకులమునకుఁ దగదంటివే? అట్టి యాచారమే లేదంటివే? సూర్యచంద్రులు గతులు దప్పినను నే నబద్ధ మాడనంటివే? గడ్డముఁబుచ్చుకొని బ్రతిమాలితివే? లాలించితివే? నక్కవినయంబులఁ గనబరచితివే? నీకున్న యన్ని తెలివితేటలఁ జాటితివే? పరితపించితివే? ఇవియన్నియు మఱపాయెనా? అవును, నివు రామచంద్రు నెటుల వదలియుండఁ జాలవో యటులనే రామచంద్రునికడ నాతనయుఁడధముఁడై పరిచారకుఁడై కాలంబుఁ బుచ్చుటఁ జూడఁజాలను, చూడఁ జాలను. కోరినరీతి నిచ్చెదనని యుద్ధమైన గడ్డిఁగఱచి యిప్పుడీతొంట చేతులఁజాచ నీమానసం బెట్లంగీకరించినది? ప్రమాణమునకు నియమము లేదా? పాపభీతి లేదా? ధర్మము లేదా? నీయభయప్రదానమును సార్థక పఱచుకొనకున్న మీకులంబున కపకీర్తి కాదా? నలువురును నవ్వరా? అప్రతిష్ఠ గాదా? స్వల్పహాంశము కొఱకెంత రాద్ధాంతముఁ జేయుచుంటివి? పదునాలుగేండ్ల కాలమెంతలో ముగియును? రాముఁడేమి మఱలరాఁడా? రామునిపై నాకుమాత్రము ప్రేమము లేదా? అతనిపైఁ గసియా? సవతిప్రేమమే నాకాతనిపై యున్నచో నీకు నాపై సవతిభార్యాప్రేమమేయున్నదని విశ్వసింపవలసినదేగదా? అట్టి భావముననున్నప్పుడు ప్రమాణములు చేయుమని, యీమందిరప్రవేశమొనర్చి యీయాగచాట్లు పడుమని యెవ్వరైన బొట్టుఁగాటుకఁ బెట్టి పిలిచిరా? ఈ యక్కఱకురాని యఘుపరింపులు నెత్తిపైఁ బెట్టుకొని, ధర్మవిరుద్ధ లోపములన్నియు నీయందుఁ బెట్టుకొని

మీఁదుమిక్కిలి నన్ను నిందాపాత్రురాలినిగా నొనర్చుట నీకుఁ దగునుగాఁబోలు? ఎంతయుపన్యాసముఁ జదివితివి? ఎంతవింతలగు సంబోధనంబులఁ బ్రయోగించితివి? ఎంత వగర్చుచుంటివి? పోనిమ్ము. కొంతతడవాయాసముఁ దీర్చుకొనుము! పాపము! ఊరకఁ గేకలు వైచుట పురుషుల ధర్మము గాదు. నోటివెంట నాడిన వాక్యంబులఁ సార్థకపఱచుకొనవలయును, అప్పుడు మీగొప్పదనము.

దశ—కైకేయీ! నామాట వినవా? నీయభిప్రాయమును మార్చుకొనవా? నాకులోద్ధారకుఁడగు రామభద్రుని యయోధ్యానగరంబున నుండనీయవా?

కైక—నన్నేల నిష్ఠూరముఁ బెట్టెదరు? విన్నవారేమందురో యని జంకుఁ గొంకు లేకఁ జేసిన వాగ్దత్తమును విడువుమని యీవెఱ్ఱి వేషంబుల వేయుట మీకుఁ బాడియే నా? మీవంశపు పూర్వీకు లిట్టులనే యొనర్చిరా? చూడుఁడా హరిశ్చంద్రుఁడు మీవంశీకుఁడే గదా?

శా. పృథ్వీరాజ్యముఁ గోలుపోతి నని యే ♦ వేళన్ విచారింపఁడా
సాధ్వీరత్నము విప్రునింట నతిని ♦ చంబైన దాస్యంబులో
నధ్యాన్నంబుగ నుండెనంచుఁ దలపో ♦ యన్ బోఁడు పుత్రుండుయీ
పృథ్విన్ బాసెనటంచుఁ గుందఁడిటులన్ ♦ వేషించెనే భూవరా.

ఆతని మనోనిశ్చయము, ఆతనిసత్యవాక్పరిపాలనాధురీణత్వము వర్ణింప నాదిశేషునకేని నలవియగునా? ఆతఁడట్టి యవస్థలనన్నిఁటి ననుభవించుటకుఁ గారణమేమి? పవిత్రంబగు సత్యమును నిల్పుటకే కదా? తుదకది యేగదా యతని నుద్ధరించినది. అట్టివారి గౌరవమర్యాద లంతరింపఁ జేయుట మీకు ధర్మముగాఁ దోచెనా?

దశ—ఓ కైకేయీ! నీవెట్టి ధర్మకన్నములంగ్గడించినను దుర్భరవిచార
మగ్నుడనై కృశించుచున్న నా దెవ్వుల కేక్కడవు. ఎక్కడవు. రామా
రామా! రఘుకులసోమా! నీపాలిటి క్రూరాత్మురాలెట్లు
దాపురించినదిరా తండ్రీ!

గీ. నిండుకొలువులోఁ గూర్చుండి ♦ నిన్నుఁ బిల్చి
నంపి యిదె రాజుఁగాఁ జేతు ♦ నయ్య రేపు
నీవు, నీసతి, యుపవాస ♦ నియతినుండి
సిద్ధముగనుండు పట్టాభిషే ♦ కమునకు.

గీ. అనుచుఁ బలికిననానోటఁ ♦ దనయ! నేఁడు
పిలిచి, వనములకేగరా ♦ ప్రియకుమార
యనుచు నాజ్ఞయ నోరెటు ♦ లాడు నాకు
ప్రేలదే నాదు నాల్కవే ♦ చీలికలుగ.

హా కుమారా!

. బ్రతిమాలుకొంటి ఘో ♦ రపు వాంఛ గోరుట
దగదని నీపిన ♦ తల్లి నెంతొ
బ్రాల్మాలుకొంటి నీ ♦ పాదముల్ మ్రొక్కెదఁ
దనయుని క్షమియింపు ♦ మనుచు నెంతొ
మొరఁ బెట్టుకొంటి నీ ♦ చెరలోనఁ బెట్టినఁ
గనులతోఁ జూచుకొం ♦ దనుచు నెంతొ
వేడుకొంటిని యూర ♦ వెలువల నెట నైన
నునిచిన చాలు నా ♦ కనుచు నెంతొ.

గీ. భరతునికె కట్టఁవాడనీ ♦ పట్టమిప్పు
డనుభవింపుము సర్వ సౌ ♦ ఖ్యములటంచు

నెంతఁ దెల్పినఁగాని దా ♦ నత్యంతమందు
దయఁదలంచ దిదెంతటి ♦ దయ్యమొక్కొ.
అయ్యో ! రామా ! రామా ! నిన్నిట్లుబాయు
దునురా తండ్రి ! రామా ! రామా!

(మూర్ఛిల్లును.)

రాము.—(ప్రవేశము.) తండ్రీ ! వచ్చితిని. ఏమిది నన్నుఁ జూచినంతనే తండ్రిగారు మూర్ఛాగతులైరి. తల్లీ ! కారణమేమమ్మా !

సీ. కంఠారవము విన్న ♦ క్షణముననే నాకె
దురువచ్చి యెంతొ సం ♦ తోషగతిని
రారరాఘవయంచు ♦ నోరారఁ బిలచుచుఁ
బైకెత్తి ముద్దాడి ♦ వరసుతుండు
నాకులోద్ధారుఁడు ♦ నారతనాల మూట
యచుఁ బల్కుఁ బ్రీతితోడ ♦ ననుచు నెంతొ
యుబ్బి తబ్బిబ్బులై ♦ యుండు నాజనకుండు
కారణమేమొకో ♦ గాని నేఁడు
గీ. రామ! శ్రీరామ! రఘురామ! ♦ రామయనుచుఁ
బిలిచి యారీతి వచ్చిన ♦ పిదప నన్నుఁ
జూచి మూర్ఛిల్లె నిదియేమి ♦ చోద్యమమ్మ
తల్లి! చెప్పఁగదవమ్మ త ♦ త్కారణంబు.

కైక.—నాయనా ! రామభద్రా ! కారణంబేమని తెల్పుదును. అయి నను సకల సద్గుణరాసివగు నీకుఁ దెలుపరాని యంశమేమి యును లేదుగదా! కూర్చుండుము.

రాము—తల్లీ! చెప్పుము? సావధానచిత్తుఁడనై యున్నాఁడను. తత్కా-
రణంబు విన నామనంబు దత్తఱపడుచున్నయది,

కైక—వినుము, తల్లి దేవాసురయుద్ధమునాఁడు రణరంగమున నేను
మీతండ్రిగారికి సాయపడినప్పుడు నాకు రెండు వరంబులు
ప్రసాదించి యున్నారు.

రాము—సరే. దాని కేమి.

కైక—ఆ వరంబులాతఁడు నాఁ డప్పుడు లేకుంటచే సమయంబు
వచ్చినప్పుడు కోరుకొందుననఁగా సరియనిరి.

రాము—అవును. అవసరమగు వేళల నిందులకని యావరంబుల
మాతండ్రిగారికడ దాచుకొంటిరి. తప్పేమి? పిమ్మట?

కైక—నాఁటిసమయ మిప్పుడు లభియింపఁ గోరుకొంటిని.

రాము—వరప్రదానమునకే తండ్రిగారిట్లు మూర్ఛిల్లినారా ?

కైక—నాయనా! లేదోయి. చివరకంట వినుము

రాము—చిత్తము, తల్లీ! ఆరెండువరము లెట్టివి ?

కైక—అట్లడుగుము. నిన్ను నారబట్టలతో నట్టడవులకుఁ బదునాలు
గేండ్లు ప్రవాసమునంపి, భరతునకుఁ బట్టముఁ గట్టుమంటిని.

రాము—దానఁ దప్పేమి ?

సీ. నిప్పులోనైన నుఱికెద • నిర్విచార
ముగను విషమేని గ్రోలెదం • బోధినేని
దూకి సంసిద్ధునగుదు సం • తోషముగను
తండ్రియే యాజ్ఞనిడ చేసెఁ • దల్లి! వినుము.

కైక—తండ్రీ! బుద్ధిమంతులగు వారిలక్షణములవ్వి, నిన్నుఁ బాసి
యుండలేకఁ, బరితపించుచు, నిటుల మూర్ఛిల్లినారు.

రాము—అయ్యో! తండ్రిగారి కింతటి విచారమేలనమ్మా !

మ. వనవాటేముల వెంటలోఁ గడచు, పా ♦ షణ్ణంబులన్ మానులన్
ముదితోత్సాహముఁ గోఁడఁ గొల్చుచు, పతం ♦ బుల్ వారి యాశీస్సులం
దెద వారల్ నియమించు కార్యముల భ ♦ క్తిన్ జేతు నన్నింతు న
భ్యుదయంబందగ వారమేను, హృదయం ♦ బుల్ శుద్ధిగావించెదన్.

ఈవిధముగా నాయరణ్యంబున నత్కాల క్షేపము నొనర్చి
వెంటనే వత్తును. తల్లీ! నాయనగారిని లేపి నేను వచ్చియుంటి
నని విన్నవింపుము మాతా!

కైక—నాయనా! రామభద్రా! నీ తండ్రిగారిప్పుడు నాయందాగ్ర
హచిత్తులై యున్నారు. కాన మెల్లఁగఁ జెంతఁ జేరి నీవే
పిలువుము.

రాము—అట్లనే తల్లీ! (చెంతకుఁ జేరి) తండ్రీ! దశరథేశా!

మ. కనుగా రాముఁడఁ జూచుకొంటివి నసుర్ ♦ గాఢవ్యమున్ బూన వి
వ్వుడు నాయందునఁ జూచినంత నెమదిన్ ♦ మోదంబునుం జెంది నా
కొడుకా! రమ్మని చేరదీసినను, గో ♦ ర్కుల్ దీర్తు నీ వివ్వ డి
వ్వుమునన్ జూడి యిదేమి తండ్రి యిటులన్ ♦ మూర్ఛిల్లి నావయ్యయో.

దశ—(పరుండియే చూచి) రామా! రామా! రామా! వచ్చితి
వా? వచ్చితివా? ఉతుచ్ఛుఁడు, రఘుకుల వినాశకుఁడు, నీ
మొగము చూడఁజాలఁడు, చూడఁజాలఁడు

గీ. రాజుగాఁ జేతునంచు నో ♦ రారఁ బిన్నఁ
బిలిచి యీనాఁడు నిన్ను నే ♦ వనములకుఁ బ్రి
వాస మంపంగఁ దలపెట్టి ♦ పాతకుండ
నైతి నీమోము నెట్టులఁ ♦ జూతుతండ్రి.

హా! రామా! రామా (అని లేచి కౌఁగిలించుకొనఁ
బోయి మంచముఁ గ్రిందపడును.)

రాము—హా! తండ్రీ! ఇదియేమి దారుణము? నాకొఱకేల యిట్టుల విలపింతురు? ఏల మూర్ఛాగతులగుదురు?

గీ. కానలకుఁబోయి మునిసేవఁ ♦ బూని పాప
పుంజములఁ బాఱఁ దోలుకఁ ♦ బుణ్యగతుల
నంది రాముఁడు నాకయిఁ ♦ జెందనేల
జనక! దుర్భరమైన వి ♦ చారమిట్టుల.

(తెఱలో)

ఓయీ! నన్నాపనేల? పోనిమ్ము.

గీ. కంఠకావరమూని రా ♦ ఘవుని వనుల
కంపఁగోరిన యా కుటి ♦ లాత్మలెవరో.
కట్టి వధియించి రాముని ♦ బట్టభద్రుఁ
జేసి నాతండ్రి ముదమందఁ ♦ జేతునిపుడు.

రాము—(తనలో) అక్కటా! క్రోధస్వభావుఁడగు లక్ష్మణుఁడుకూడ నిప్పుడే రావలయునా? ఇప్పుడీతని నివారించుట కష్టఘటముగదా! కాబట్టి అమ్మగారికడ సెలవుఁగైకొని వైళంబ పోయి యాతనిరాక నివారించెదఁగాక! (ప్రకాశముగా) తల్లీ! కేకయరాజపుత్రీ! నాకమితోపకారమొనర్చి నన్ను ధన్యునిగా జేసిన నీఋణమెట్లు తీర్చుకొందునమ్మా?

గీ. బహుళ సంతోష హేతువై ♦ బరగు రాజ్య
భారమును వీడి సుఖముగా ♦ వనములందు
దాపసుల మ్రోలఁ జేరి నా ♦ పాప పుంజ
ములను వదలించుకొనుమని ♦ పలికినారు.

కావున నో మాతా! చంద్రునకొక్క నూలుపోగనునట్లు నావందనశతంబులను గైకొని యాశీర్వదించి పంపుము.

కైక—అవును. రామా! తెల్లవారకముందే బయలుదేరవలసినవాఁడవగుట శీఘ్రముగఁ బ్రయాణసన్నాహములో నుండుట యుచితముగదా?

రాము—అమ్మా! సన్నాహములో నుండుట కేమున్నది?

కైక—అట్లనకుము. అరణ్యవాసము నొనర్పఁ బోవువాని కీయమూల్యవస్త్రాభరణములతోఁ బనిలేదు. కాఁబట్టి వానినెల్ల విడచి జడలధరించి నారబట్టలను గట్టుకొని పోవలయును. తెలిసెఁదా?

రాము—తల్లీ!

గీ. సర్వరాజ్యంబుఁ ద్యజియించి, ♦ సకలబంధు
వర్గమును వీడి, సుఖముల, ♦ బాసి పితృ
వాక్య పరిపాలనార్థమై ♦ వనులకుండఁ
బోవువానికి నాకిది ♦ గావలయునె?

కావున, మీ యాజ్ఞానుసారప్రవర్తకుండనై యట్లనే నారలఁ గట్టి జడలధరియించి పోవుదునమ్మా!

కైక—రామచంద్రా! ఒక్కసంగతి?

గీ. ఒంటిగాఁ గానలకుఁ బంపు ♦ మంటినంచుఁ
దీవ్రముగనున్నవారు నీ ♦ తండ్రిగారు
భరత శత్రుఘ్ను లిట లేరు ♦ వారు దూర
దేశమున నున్నవారలి ♦ తీవ్రకోప
గతిని చెలరేగువాఁడు ల ♦ క్ష్మణుఁడు నుమ్ము.

గీ. కులగురువు, మంత్రి నావాక్య ♦ ములను వినరు
భరతుఁ బిలిపించి వెంటనే ♦ పట్టభద్రుఁ
జేయవలెనని కట్టిగాఁ ♦ జెప్పి పొమ్ము
ర్వారితగతి గురులతోడను ♦ దండ్రితోడ.

రాము—తల్లీ ! అట్లనేఁ గాని.

గీ. కని, విరామము లేకఁ జే ♦ దినముగాత్మ
జైన నాతండ్రిగారికో ♦ నేను తెల్ప
కమె పెదలుపెట్టు ధర్మమా ♦ కనఁడు, వినఁడు
పలుకరించినఁ గాని నా ♦ పాతకమెయి.

కైక—తనయాజ్ఞ వెంటనే నిర్వర్తింపలేదని మనమునఁ బొగలుచు నీవంకఁ జూడకున్నారు.

రాము—తల్లీ! నీమాటయే సత్యమైనచో నేనాయన కట్టిబాధయు గలిగింపఁ జాలను; నాకు నీయాజ్ఞయైనచోఁ దండ్రిగారి యాజ్ఞ యైనట్టులఁగాదా ? ఒక్కమనవి. అమ్మా !

గీ. నావియోగము చేత మ ♦ నంబునందుఁ
బొగిలి కృశియించుచును క్రమం ♦ బుగను క్షీణ
దశకు రాకుండఁ దండ్రిని ♦ దయను జూచి
పాలనమొనర్చు మమ్మ కృ ♦ పాంబురాసి.

(అని తండ్రిగారికిఁ బ్రదక్షిణ మొనర్చి పాదములకు నమస్కరించుచు)

గీ. ఆదరించితివయ్య యు ♦ పార్జితముల
నేకొరంతలు లేకుండ ♦ నే మహాత్మ !
అట్టి ఋణమందు నేనవా ♦ ప్రింతమైనఁ
దీర్చుకొననైతి నని యెద ♦ దిగులుఁగాంతు.

మఱియు నో తండ్రి !

గీ. కనులకే సంతతంబద్దు ♦ కొనెడు ముద్దు
పాదసేవను విడనాడి ♦ నీకు వాంఛఁ
దీర్పఁగాఁ గానలకుఁబోదు ♦ దేవ ! నాదు
వందనంబులఁ బ్రేమతో ♦ నందుమయ్య.

తల్లీ ! ఇదే పోవుచున్నాను. (నిష్క్రమించుచున్నాఁడు.)

కైక—ప్రాణేశ్వరా ! లెండు.

దశ—(లేచి కూర్చొని) రామా! రామా! రాముఁడేడి? రాముఁడేడి? రఘుకుల యశఃకాముఁడేడి ? సర్వలోకాభిరాముఁడేడి? సకల సద్గుణ సరంధాముఁడేడి ? వడలెనా ? ఘోరాటవులకు ? ఒంటరిగా ! అయ్యో ! చూచువారు లేకఁ, దలచువారు లేకఁ, బిలచువారు లేకఁ దినఁ దిండి లేకఁ, బండ మంచము లేక నేగతి నల్లాడునో. దైవమా ! ఎంతపని చేసితివి,

గీ. కొడుకులో. కొడుకులోయంచు ♦ గుండిగుండి
నిదుర హారములనువీడి ♦ నేనొనర్చి
నట్టి తపమునకిటు ఫలఁ ♦ బెట్టిమఱల
లాగుకొని యేడిపింతువే ♦ లా ? మహాత్మ.

దేవా ! లోకరక్షకా! నాజన్మమంతయు నిటులనేడ్పులతో నింకిపోవలసినదేనా ?

సీ. సుతులు లేనట్టి గతికి నే ♦ డ్చితిని మొదటఁ
బిదప గాధిసుతుండు యే ♦ డ్పించె నన్ను
యిపుడు కైకేయిమూలాన ♦ నిట్టులేడ్చు
చుంటి నన్నింతఁగాఁ ♦ జేయుచుంటివీవు ?

గీ. ఇదియె తుదిసారియేడ్పు యిం ♦ కేడ్వ లేక
నున్నవాఁడను శోషిల్లు ♦ నుండె ప్రాణ
వాయువులు. దైవమా ! రఘు ♦ వంశజలధి
సోముఁడగు రాముని గాయు ♦ చుంటచేత,

హా! రామా! రామా! (అటునిటుజూచి) ఎవఁడురా! అచట

సేవ—(ప్రవేశించి) దేవా !

దశ—ఓరిభద్రా! నన్ను జాగ్రతగఁ గౌసల్యాంతఃపురంబునకుఁ దోడ్కొనిపొమ్ము. (భటసహాయమున నిష్క్రమించును.)

కైక—నాప్రియత్నము కొనసాగినందులకు మంథరకీవార్త నెఱింగింపఁబోదును. (నిష్క్రమించును)

(తెరవ్రాలును.)





శ్రీరామచంద్ర.

# పాదుకా పట్టాభిషేకము.

## చతుర్థాంకము

(రామలక్ష్మణులు ప్రవేశము)

లక్ష్మ—

మ. తనపుత్రున్ బృథ్వీశుఁ జేయ నెంచి నినుఁగాం ♦ తారంబులం దుండఁ బం
పను వాంఛించిన వార లెవ్వరు ? ధను ♦ ష్పాండిత్యముల్ జూపి మి
మ్మున నే నిప్పుడె రాజుఁ జేసెదను స ♦ మ్మోదంబునుం జెంది స
న్మునిసందోహము వర్ణనల్ సలుపఁగా ♦ మోదించుమా రాఘవా.

రాము—తమ్ముఁడా ! తొందర పడకుము. దైవతుల్యులగు పెద్దలదూషించుట దోసంబని యెఱింగి యుండియు నిట్లాగ్రహాయత్త చిత్తుండవగుట ధర్మమా ?

గీ. తల్లితరువాతఁ దల్లియం ♦ తటి మహాత్ము
రాలు పినతల్లి యామె పైఁ ♦ గ్రౌర్యమూని
యిటుల దూషణఁ జేయ ని ♦ న్నేమనందు
ననుజ! లోకులు నవ్వరే ♦ హాని కాదె?

లక్ష్మ—అగ్రజా! ధర్మాధర్మవిచక్షణులు మిమ్మటుఁ జూడవచ్చును
గాని తొందరపడరాదని నన్నే మందలించుచుంటిరా?

గీ. శ్రేష్ఠులగువారు మాటాట ♦ చెల్లునుగద
అందాననగు నారదై ♦ యులరుమిమ్మ
వనములకుఁ బంపి తనపుత్త్రుఁ ♦ బట్టభద్రుఁ
జేయఁగోరుట తొందర ♦ చేఁతగాదె?

అది యటుండనిమ్ము.

గీ. ముందు వెనుకల నరయక ♦ తొందరపడి
యిచ్చెరీతిని వరముల ♦ నిచ్చినాఁడ
మనుచు జనకుఁడు తలపోయఁ ♦ దయ్యె నుట్టి
చేతలకుఁ గారణమదెందు ♦ చేతఁ జెప్పుము.

తొందరచేతనేగదా! అంతటి యవివేకుఁడా? ప్రపంచజ్ఞాన
మేమియు లేకుండెనా?

గీ. ధర్మమును దప్పకుండఁ ♦ ధాత్రి నేలె
వేలకొలఁదిగ వత్సరా ♦ లేల యుట్టి
యవకతవక ప్రమాణాలు ♦ గాచరించె
మందుఁడగుటకు నతనికి ♦ మతులు లేవె.

రాము—తమ్ముఁడా! సుమిత్రాకుమారా! క్రోధస్వభావుఁడవై
పలికెడు మాటలకుఁ బ్రత్యుత్తర మొసంగఁజాలనుగాని శాంత
భావంబున విందువేని రవంత నీతోడఁ బ్రసంగించెదను. ఎన్నఁ
డును నామాట కడుగుదాటనివాఁడవుగదా? మఱియు,

గీ. పుట్టుమొదలుగద వరం ♦ బులను నామె
కొసఁగునాటికి యుండెమి ♦ దొసఁగు గలదు
అవసరము లేకపోవుట ♦ నప్పుడామె
దాచుకొనియెను దండ్రి యొ ♦ ద్దను గదయ్యా.

గీ. ఆవరంబుల నిచ్చెడి ♦ యంగఁ గోర
సత్యవాక్యంబుఁ దా విస ♦ ర్జనముఁ జేయ
లేక నొసఁగుటఁ దప్పేమి ♦ లేదుగాదె
దీనఁ గ్రోధంబదేందుకుఁ ♦ బూనెదీవు.

కాఁబట్టి నాపురాకృతపాపపరిపాకఫలం బీపాపంబుగాఁబరిణమించెనని యనుకొని యూరడిలుము.

లక్ష్మ—అన్నా ! సకలసద్గుణసంపన్నా ! అట్లనుకొని యూరడిల్లవలయునా ?

గీ. సకల సౌభాగ్యయుతులు ని ♦ క్ష్వాకుకుల శి
రోమణులరైన మీరు మహా ♦ ర్షులు బోనచ్చి
నట్టిదుండగముల కిట్లు ♦ కట్టుబడి మ
హాటవుల కేగుటను జూచి ♦ యూఁగఁగలనె.

(కైకేయి నుద్దేశించి) ఆ మూర్ఖురాలా? ఎంత కట్టడి కార్యమునకుఁ దలపెట్టితివి ?

గీ. వృద్ధరాజును బలవంత ♦ పెట్టి యెల్ల
జగములను బ్రోవఁగాఁ దగు ♦ సర్వసుగుణ
ధుర్యు శ్రీరాముసిటు పంపు ♦ దువె మహాట
వులకు నీకెనుమంతేని ♦ బుద్ధి లేదె.

రాము—తమ్ముఁడా !

గీ. అడుగుఁదప్పి యెఱుంగ వె ♦ న్నఁడును నాదు
పల్కులకు నేమి విపరీత ♦ మల్కఁ బూని
వారి వీరినిదిట్టుట ♦ వలన ఘోర
పాపముగదయ్య క్రోధంబు ♦ వదలుమయ్య.

లక్ష్మ—అయ్యా ! అట్లైనచో మీరు వనంబులకేగుటకే నిశ్చయించిరన్నమాట.

రాము—ఆహా! ముమ్మాటికిని నిశ్చయించితిని ఏమందువా ?

గీ. తరణికాలమునఁ బొడమిన ♦ దానిఫలము
పెద్దవారిమాటలఁ జెవిఁ ♦ బెట్టి వారి
యాశయంబుల నెఱవేర్చి యు ♦ న్నతయశము
గాంచుటయెగానఁ గానవ ♦ సించువాఁడ.

ఇది యట్లుండనిమ్ము. నాయందుఁ గల యపరిమితానురాగంబున నన్నుఁ బాయలేక యీ రెల్లరిటుల సంతాపపడిరి యెదరుగాని నాయరణ్యవాసము నాకు సుఖదాయకము. కష్టము గాదు. ఈవిషయమున నాకు పినతల్లిగారు మహోపకారము యొనర్చి నన్ను ధన్యునిచేసినది. ఎట్లందువా !

గీ. పెద్దవారిభారమును నెత్తిఁ ♦ బెట్టుకొని నే
నంత కష్టములనుబొంద ♦ రాము! యేల
వాంఛఁ బొందెదు సుఖముగా ♦ వననివాస
మునను నేకాకివైయుండు ♦ మనుచుఁదెలిపె.

మఱియు,

గీ. తపసులెందఱోగలరు కాం ♦ తారమందు
వారిసేవలఁ జేసుక ♦ బ్రదుకుమయ్య
పాపహరణంబు గలుగు నం ♦ ప్రాప్తమౌను
మోక్షసామ్రాజ్య మని తల్లి ♦ బోధచేసె.

అంతియేగాక, తమ్ముఁడా! మనదూరదృష్టిని యుంచుకఁ బరికించినచో మనకుఁ దెలియుటలేదా ?

# పాదుకాపట్టాభిషేకము.

గీ. ఐహిక సౌఖ్యవాంఛల ♦ యందు మఱఁగి
దైవ చింతనమే లేక ♦ దగ్ధులైన
వారి నెందఱఁ జూడమ ♦ వ్వారి పోకఁ
బోవఁగా నేల సిలుగుల ♦ బొందనేల ?

కాఁబట్టి పినతల్లిగారియాశీర్వచనమువలన లభించినయీయాయుల్ప కాలమునందు,

గీ. పరమ పాతకమైనను ♦ ర్వాంఛలను వి
వర్జనఁ బొనర్చి దుర్జన ♦ భర్జనుఁడగు
నారమేశుని బ్రార్థించు ♦ చనవరతము
గడుపుకొనవచ్చు గద ని ♦ రాఘాటముగను.

లక్ష్మణా !

గీ. ప్రియమంతయు భోగముల్ ♦ వలనఁ గడచి
వార్ధకమువచ్చుపిదప దై ♦ వమునుదలఁచు
కాలమే లేక హీనంపు ♦ గతులఁబోవు
కంటె యిది మేలుగద మోక్ష ♦ గతినిగనఁగ.

(అటునిటుఁజూచి) తమ్ముఁడా! అటుఁజూడుము?

గీ. దాశరథిసీత నాఁగ్రియా ♦ ణంబు వినుటఁ
గంటికిని మంటికిని ధారఁ ♦ గాఁగ నేడ్చు
చిచటకే తెంచుచున్న ది ♦ దేమి వారి
యా మనోదార్ఢ్య మెట్టులో ♦ యనుజ యిపుడు.

సౌమిత్రి !

గీ. శివధనుస్సును రెండుగాఁ ♦ జేయుటాది
నేటివఱకును నిముసమే ♦ నిఁక వదలని

యట్టి యీసాధ్విసిన్ బాసి ♦ నట్టడవుల
కెటులఁ బోయెద వాఁడ నే ♦ నేమి సేతు.

సీత—(ప్రవేశించి) నాథా! నన్నిచట నేకాకినిగా నొనర్చి వనులకరుగఁదలఁచిరా!

రాము—దేవీ! అసురయుద్ధంబునఁ బినతల్లిగారగు కైకేయరాజపుత్రి మాతండ్రిగారికొనర్చిన యమూల్యసహాయమున కచ్చెరువంది యిచ్చిన రెండువరంబులప్పుడవసరము లేకుండ నాయనకడ దాచికొని యిప్పుడు కోరికొని తండ్రిగారియనుమతిఁబడసె. అందు నేను జటావల్కలధారినై పదునాలుగేండ్లరణ్యవాస మొనర్చుట మొదటిదియు, రాజ్యాభిషేకము భరతునకొసంగుట రెండవదియునై యున్నవి. అందువలనఁ బితృవాక్యపరిపాలనార్థము వనంబులకేగు నన్నుఁజూచి మీరెల్లరు సంతసించుటకుమాఱుగా విచారగ్రస్తులరై నా ప్రయాణమునకుఁ బ్రతిబంధము గల్పించుటఁదగునా? నీవేకాకినిగానుండనేల? చూడుము!

గీ. అతివిచారమనస్కుల ♦ రైనయట్టి
జనకునకు నీవు సేవల ♦ సలిపి నేను
లేనకొదువ దీనభావంబు ♦ మాని నాకు
మాఱుగా వారికడనుండు ♦ మా పడంతి.

సీత—ఆ! ఆ! నాథా! పతిని విడియుండుట సతికి గతులు లేవనిపలికెడు వార్యవచనంబుల రిత్తఁజేయఁదలంచితిరా? మిమ్మున నే త్రుటికాలమేని విడియుండఁగుదునా? ప్రాణేశ్వరా! మీరరణ్యంబునఁ బడరాని యిక్కట్టులఁ బడుచుండ నేనీభోగంబుల ననుభవించుచుండఁగలనా? ఎన్నఁడు పతిని విడియుండఁగని విపరీతవా

క్ష బల కేడిట్టులాయెట మీకు భావ్యమా? దేవా! నన్నిట్లు నిరోగనాధారస్థితిఁ ద్రోసి వనంబులకరుగ మీచిత్త మెట్లొ ప్పినదో గ సహింపఁజాలకుంటిని.

రాము—ప్రాణేశ్వరీ! నిన్ను విడచి నేను మాత్ర ముండఁగల్గుదుననుకొంటివా? కాని,

గీ. క్రూరమృగసంకులంబగు ♦ ఘోరవనిప్ర
సించుటన్నను మాటలా ♦ చిగురుబోఁడి
భయదమును గల్గఁజేయు ని ♦ ల్వఁగ లేవు
నావలుకులాలింపుమీ ♦ నాతిసిప్పు.

సీత—ప్రాణేశ్వరా! తపినావాసయోనస్సుల కగు భయంబని నేనెఱుంగనే పోలేదు మీ పాదపూజలోనన్నియు మీయుండినన్నచో నాకా వనస్థలంబే మందిరంబగును ఆకార్గమృగ సంచయమే నాకుఁ బెండ నాకయోనుకు వక్షీతతియగుఁబు అందమూలాదిఫలంబులే పంచ భక్ష్య పరమాన్నంబులగును, ఆ వృక్షతలంబే హంసతూలికాత ల్పంబగును. మీతోడిపాటుగా ధరిత్రీయాను నారగుడ్డయే లుఁకు పంబవయగును. కాన నాధా! నాకట్టి భీతులఁగల్పించక నన్ను మీ వెంటఁగొనిపొండు.

లక్ష్మ—అన్నయ్యా! దాసుఁడను.

మ. వరమానస్యముఁగొల్చు రాజ్యమున ని ♦ ల్వంజాల మీ వెంట భీ
కర కాంతారములందుఁజొచ్చి మిములన్ ♦ గాపాడుచుందున్ భవ
చ్చరణాబ్జంబులఁగొల్చుచుందును దయా ♦ దాక్షిణ్యముల్ జూపి సో
దరవాత్సల్యము నిల్పుమయ్య యనఘా ♦ రామా! జానకీవల్లభా!

రాము — తమ్ముఁడా! ఇది యేటికోర్కె?

గీ. సుఖముగా ధరిత్రిఁ గొల్చు ♦ చుండి సర్వ
భోగములఁ బొందఁగా లేక ♦ నిగతి వన
ములకు నేతెంచి యిడుములం ♦ బొందెదముఁ
గోరదవదేటి వికరిత ♦ కోర్కెనిక?

మఱియు,

మ. అరిసందోహముఁ బాఱఁ ద్రోలుచునయో ♦ ధ్యారాజ్యసంపత్తులి
ద్ధరవృద్ధిం గనునట్లుఁ జేసి కొఱలన్ ♦ దైవాఱఁగా నేలు సా
దరుఁ గోసిదగనుంచు కోర్కెగుటఁ గాంతా ♦ రంబునందుండి దు
ర్భరసంతాపముఁ గోరి కష్టములనున్ ♦ వాంఛింతువేలా? యిటుల్
అదియట్లుండనిమ్ము?

ఉ. నిప్పుడు నేను లేక జన ♦ నీజనకుల్ విలపింతురంచు ని
ర్భావమునన్ను లేక వన ♦ వాసమొనర్పఁగ నేలఁ గోరదో?
ఆవిధి వారుచింతిలను న ♦ హర్నిశముల్ గృశియించుచుండఁగాఁ
సేవలఁ జేయ నెవ్వరిటఁ ♦ జేరు మరయ్య తిదన్ములక్కటా.

లక్ష్మ — సకలలోకైకధనుర్ధరులగు మీరే వీరలవిడదిపోవుచునుండ నిఁక నేనా వీరలనుద్ధరించునది? ఇంటికిఁ బెద్దలై సంసారమునన్నిరీతులఁ జక్కఁగాఁ బరిపాలింపఁదగిన మీరు, చతుస్సముద్రముద్రితధారుణీవలయంబును నేర్పుమీఱఁ గాపాడఁగలిగిన మీరు, లోకోద్ధారణంబుకొఱకుద్భవంబందిన మీరు, దశరథేశునిగారాబంపుఁబుత్రులరైన మీరలరణ్యవాసమొనర్చుటయును, నేననవరతశోకాకులచిత్తులరగు వీరలనోదార్చుటయునా? అదియుఁగాక, మీరు లేకఁ బ్రజాఘోషంబుమితిమీఱ, మీవియోగము

చే సకలబంధువర్గంబుఁ గుందుచుండ, నీరోదనధ్వనుల మధ్య నేనా
నిలువఁ దగినది? అహా! రామచంద్రమూర్తి,

గీ. గాధినందనుసవన ర ♦ క్షణముఁ జేయ
నడవులకుఁ బోవువాఁడు వెం ♦ బడిని రాఁగ
"లక్ష్మణా! నిన్ను సర్వకా ♦ లంబులందుఁ
బాయకుండఁగనుండెడి ♦ వాఁడ" నన వె.

మఱియు,

ఉ. తాటకఁ గూల్చువాఁడు, రిపు ♦ దర్పము సర్వమునూడ్చువాఁడు, దు
ర్గాటవిలోఁ జరించుతఱిఁ ♦ గష్టములందినవాఁడు నీకు బా
హాటముగా సహాయకుఁడ ♦ నైనపు డగ్రజభాగ్యముల్ నిరా
ఘాటముగాఁ గొంటివన ♦ గంజనిబల్కును యిప్పుడేమయెన్.

అంతియఁగాక,

మ. సకలంబీవెయటంచు నమ్మికొనిగ ♦ ష్టంబందునన్ సౌఖ్యమం
దకలంకంబుగ వెంటనంటి యతిథై ♦ ర్యస్ఫూర్తి మెల్లాడు న
న్నకటా! యీవిపరీతరాజ్యమున న ♦ న్యాయంబుగా వీడి పో
నిఁక నెట్లుండెడివాఁడ దాశరథి యిం ♦ తేనా భవత్ప్రేమముల్.

అన్నా! పెక్కుమాటలేల,

గీ. ఘోర రారణ్యములకు మీ ♦ వెంట నన్నుఁ
గూడఁ గొనిపోవఁ బ్రీతి లేదె ♦ వాఁడ లేక
విడచి యేగినఁ బ్రాణముల్ ♦ విడచువాఁడ
నిలువఁ గాఁజాలమిమువీడి ♦ నిముసమేని.

రాము:—తమ్ముఁడా! కాఁబట్టినకుందేటికి మూఁడే కాళ్ళనునట్లు నీపట్టు పాఁతిమీఁదనుంటివి. వలదన్న బలవన్మరణంబునకు సిద్ధపడుచుంటివి, నీకేమని చెప్పఁగల్గుదును? అట్లనే మీతల్లిగారియనుమతిఁ

బడసిరమ్మ. సీతాపతీ ! నీవుఁగూడ బ్రయాణసన్నాహము
లోనుందుము. లక్ష్మణా ! అవిగో చూచితివా ? మదీయవియో
గంబుచేఁ బ్రళయదుఃఖార్ణవంబునఁ బడికొట్టుకొనుచున్న తండ్రి
గారినోదార్చుచు నాతల్లిగారును నీతల్లిగారును నిటువచ్చుచు
న్నారు. వీరల నేరీతిశాంతింపఁజేతుము ?

(అంతట దశరథుఁడును, కౌసల్యా సుమిత్రలు ప్రవేశము.)

కౌస — హా తనయా ! మనుష్యులనందఱి నీవిధముగఁ జేసి యడవుల
పాలై పోదువా ! తండ్రి! నీపినతల్లి యెంత చేసినదిరా? నాయనా?

రాము — తల్లీ! అయ్యమ్మమీఁద నేల నేరం బారోపించెదవు? నీకుమా
రుని పురాకృతకర్మఫలంబనుకొనుము.

కౌస — తనయా ! అట్లనుకొని ధైర్యముఁ జెందుచుల్లు,

మ. వరసాకేతపురంబు నేలుచు మమున్ ♦ బాలించి రక్షించి యు
ద్ధర నిష్క్రాతకులంబునందునఁ బ్రశ ♦ స్తంబైనకీర్తిన్ గడిం
పరఘూత్తంసమ కారణంబగునువన్ ♦ భావంబులోనుండ ! ని
ష్కారణిన్ గానలకేగుచుండ నెటుఁజీ ♦ కర్ణన్ బట్టెదన్ ధైర్యమున్.
రామా ! రఘుకుల శిరోభూషణా !

గీ. పట్టభద్రుండవై ధరా ♦ భారమెల్లఁ
దీర్చిమనుష్యుల నిలఁగడ ♦ తేర్చిమాకుఁ
బరిసిసుజలంబువదలి వ ♦ మ్మదముఁగూర్తు
వంచునమ్మితి నిటులుఁద ♦ లంచనైతి.

లక్ష్మ — తల్లీ ! అట్టియాశల నిర్మూలముచేసి పరమపవిత్రుఁడైన రా
ముని మహాటవుల పాలు జేయుచున్న రఘుకులనాశన కారణభూ
తుండనుగో ! ముందువెనుకలాలోచింపక నాదుష్టకైకేయి
మాయావ్యూహంబునఁబడి పిదపఁ బశ్చాత్తాపపడిన నేమిలా

దశ.— రామా? నీలమేఘశ్యామా! వంశనాశనుఁడగు నన్ను వధించ నుంకించువాని నీవేలయుద్ధరింతువు? ఇందు వానిదోసమావంతయును లేదు.

గీ. చేతికక్కఱకయినట్టి ♦ శ్రీరఘుకుల
భూషణుని కానపాల్జేసి ♦ ఘోరమనుచు
యీగతిని నేఁడు వాఁడిల ♦ నింకనున్న
నేమి? చచ్చిననేమి? శ్రీ ♦ రామ! రామ!!

లక్ష్మ.— (తండ్రి పాదములపై వ్రాలి)

గీ. తూలవాఁడితి కుమ్మనేఁ ♦ దొంపరవడి
తండ్రి! క్షమింపుమయ్యా నా ♦ తప్పనకదె
కొట్టుకొంటిని జెంపల ♦ గట్టిగాను
త్వద్ద్విమల పాదములకు వం ♦ దనమొనర్తు.

దశ.— లక్ష్మణా! నిన్ను నేక్షమియింప నర్హుండనా? వంశపవిత్రుఁడైన రాముని, దానవభంజకుని, సురితలకాలవిత్రుని, శ్రీరామచంద్రుని యమకానల కంపనించిన యీ పాపాత్ముఁడా? శ్రీరాఘచంద్ర కరుణాపాత్రుఁడవగు నిన్ను క్షమింపగలుగునది? ఎంత మాట? నేను క్షమింపనక్కఱలేదు? నన్ను వధియింపుము నీనిశితఖడ్గంబున కేలఁ జేయుము. ఏమి లక్ష్మణా! యూరకుంటివి.

గీ. అనినమాటను దప్పితో ♦ నగునెమోకు
తప్పకొంతలేకఁగాదె కాం ♦ తారసీమ
కంపుచుంటిని సర్వలో ♦ కాధ్యుఁడైన
రామభద్రుని రఘుకుల ♦ సోముని పుడు.

రాము—తండ్రీ! నామాటవినరా? అజ్ఞానవశంబునఁ బల్కిన వాని మాటల పరకుఁ జేయక నా మనవి నాలింపుఁడు.

ఉ. పుట్టినయప్పుడే నలువ ♦ వ్రాసినగీఁతను మాఱుగీఁతల
న్నట్టడవిన్ నివాసము నొ ♦ సర్పుమటంచును దానిదాఁటఁగా
నెట్టులసాధ్యమయ్యెడి? స ♦ హింపుఁడి యీ పదువాలుఁ గేఁడులీ
వెట్టులొ కండ్లుమానుకఁ డు ♦ డింపుఁడు నీసుతుఁడన్నమాటలన్.

దేవా! అటుఁజూడుఁడు. గురువులగు వశిష్ఠభగవానులుంగూడ వచ్చుచున్నారు. ముహూర్తకాలముకూడ సమీపించుచున్నయది.

దశ—రామా! ఈనిర్భాగ్యునకు దుఃఖోపశమనంబునకు మార్గమేమి? హా రామా! రామా! (అని ఏడ్చును.)

రాము—తల్లీ! నీవైనఁ దండ్రిగారినోదార్చుమమ్మా! మూఁడుగడియలలో ముగియు నీ యల్పకాలవియోగమునకింత విలపింప వలయునా? నాయర్ధాంగలక్ష్మియగు సీత నావెంటనుండ నాసుఖంబునకొఱంతయుండదుకదా!

లక్ష్మ—(తొందరపాటుతో) తల్లీ! అన్నగారు నాకొక వరము ప్రసాదించినారమ్మా!

కౌస—అదేమినాయనా! నిన్నుఁ గూడ రమ్మనెనా?

లక్ష్మ—అవునమ్మా! అవును.

మ. తనతోఁగూడి వనాంతరంబులకు రా ♦ ధర్మాత్ముఁడా రాముచం
ద్రునియాజ్ఞన్ గొనినాఁడ మానికులసం ♦ దోహంబునన్ గొల్చుచుం
దును భూపుత్రిని రామభద్రుని భజిం ♦ తున్ నేను ధన్యుండనై
తిని మీయాజ్ఞలఁ గూడనిచ్చినను నేం ♦ తే సంతసింతున్మదిన్.

రాము—తల్లీ ! సుమిత్రాదేవి ! కంటకావృతంబగు నాయరణ్యంబు
లకు రావలదని యెంతఁ జెప్పినను వినకఁ దమ్ముండు నావెంట
రా సిద్ధుఁ డగుచున్నాఁడు. కాన.

క. వాని నిటు వాలకించి య ♦ వంగదమ్ము
వనములకు నాకు బంపుచు ♦ వాని కెట్టి
కొఱఁత లేకుండఁ గాపాడు ♦ కొంగుఁ దమ్ము
భద్రగతి వర్తింపఁజేసి ♦ కాంచ మేలు,

సుమి—కుమారా ! సకలమ్ము నీవ యేయాఁ తమ్ముఁగాని చరించు నీ
ముద్దుతమ్ముఁడు నీవెం నుండుటకు మా కాజ్ఞకూడఁ గావల
యునా ? సకలలోకరక్షాపాలకుండవగు నీవ వానికి రక్షకుఁడ
వైయుండ మాకేమి భయము. నాయనా ! నీ యిచ్చరీతిని
వానిని సుఖముగా నీవెంటఁగొని పోవచ్చును.

కౌస—నాయనా ! సౌమిత్రీ ! నీవు గూడ సీతారాములవెంట వెడ
లెదవా ? తండ్రీ ! ఎంతధన్యుఁడవోయి.

దశ—రామా ! రామా ! వెడలుచుంటివా ?

గీ. కాననమునుండి మఱల రాఁ ♦ గలుగుదాక
నిలుతునే జీవములతోడ ♦ నేను భువిని
యిదియె కడసారి చూడవయ్యె ♦ నే ? కుమార !
యెంతదురవస్థ గలిగెనే ♦ నేమి సేతు.

తండ్రీ ! రామచంద్రమూర్తీ !

గీ. మారకము ప్రాప్తమయ్యెనా ♦ కారణమున
గాదె కొంతరచే రాజ ♦ గా నొనర్చ
దలఁచినాఁడను మదిని యుం ♦ దాక నిలచు
ధైర్యమేయున్న యిదియెట్లు ♦ తారసిలునే ?

రాము — నాయనగారు! నాయందలి వాత్సల్యముచేత నన్ను రాజుగాఁ జేయఁదలఁచితిరి గాని వేఱొండుగాదు. దుఃఖభారమునఁ గలిగి కష్టమే మీనోటివెంట నట్టి భయంకరవాక్యంబుల నాడించుచున్నది. అట్టి యర్థము మేలకలుగవలయును? మీకీ విచారమేటికి?

మ. అటనువ్వారు మునీంద్రులతోడ భోగమే ♦ శారాధ్యులై వారితో
నటవీవాసమొనర్తు నేని సుఖమే ♦ యే గాని కష్టంబుగా
నెన్నఁ డోదంగలదయ్య యోజనకా! మీ ♦ కేలా విచారంబు నా
కట సేవల్ సలుపంగ సోదరుఁడు లేఁ ♦ డా తలఁకుందునా?

గీ. వసితలంబున బహువార్లు ♦ వత్సరములు
కష్టసుఖముల నోర్చితి ♦ గనపుణ్యనును
మూఁడుతణములలో నన్ను ♦ నాదరాన
ద్వారికగతి నాజ్ఞ నీయుఁడీ ♦ తండ్రి! నాకు.

దశ — శ్రీరామ! నీవెంత దెల్పినను నాకు ధైర్యమావకున్నది గదా!

గీ. పాల్లనెన్నఁటినోఁబడి ♦ బడసినాఁడ
నిన్ను నట్టిలోఁ గల్పి ♦ నీఱుపఱచు
నాఁడవను వాశనోనున్న ♦ వాఁడ నీ
యాశలడుగంటె దైవ మో ♦ హాతుఁడనగుట

దశ — (క్రి వేళించి) రామా! ప్రాణమునాగాత్రము విడిచిపోవుట లేదా?

రాము — దేవా! వందనంబులు!

గీ. మోహావశమున దుఃఖాబ్ధి ♦ మునిఁగిపోరు
వదలకుండిరి నన్ను నో ♦ భవ్యచరిత

ధైర్యమును జెప్పి పిదప శాం ♦ తపఱచి నను
బంపుమార్గంబుఁ జూడంగ ♦ వలయుఁ ద్వరఁగ.

దశ—నాయనా! రామచంద్రమూర్తీ! ఇంక నెంతో జీవించనుగదా! నీవిటు వెడలఁ దత్క్షణంబు గుండెలు పగిలి చావవలసినవాఁడనే! తండ్రీ! ఆచచ్చుట నీకన్నులయెదుటనే జరిగినచో మనయుభయులముఁ గూడ ధన్యాత్ములమగుదుము.

సీ. కనుచు వేళను నేఁబాసి ♦ కానకేవేళఁ
దలఁపునకువచ్చి రాఘవా! ♦ తండ్రీ! నన్ను
విడిపోతివయన గుండె ♦ వ్రీలి ప్రాణ
ములను వీడను శ్రీరామ ♦ మూర్తీ! యింక.

ఈనాలుగుఘడియల కాలము నీతోఁ గూడ నుండి కాలంబుఁ గడుపుకొననిమ్ము. నాయనా! నాముద్దుఁ జెల్లింపుము? తండ్రీ! నాకేమో పిచ్చియెత్తుచున్నది! పైనఁజూడుము. మన వంశమునకు మూలపురుషుఁడైన భానుండు!

సీ. తనకులవినాశమునకెట్టి ♦ తాప్తకుం దో
కందు జన్మంబుఁ జెందె లో ♦ కమునకంతో
యుభయయశముఁ దెచ్చెనంచు దుః ♦ ఖాబ్ధిమునిఁగి
పోవుచున్నాఁడు పడమటి ♦ మూలకదిగో.

వానికిఁ దదనుకూలముగా వంశశిరోభూషణుండవై యేమో యొనర్తువని నీపైగంపెడంతాశఁ బెట్టుకొనఁగా నదియ్యా! నాయనా! యిదియా పరువు?

వశి—రాజా! ఊరడిల్లుము. లేనిపోని కోరికలఁ గోరుకొనుచు దుఃఖాకులచిత్తుఁడవై భానుకులంబున కపకీర్తిఁ దేకుము. ఈ యస్వస్థతగా నున్నసమయమున నీవా వనములకరుగుట!

చాలుఁ జాలు, రాముఁడీ వనవాసకాలము నెంతసంతసంబుగా
గడుపునో చూడుఁడు. ధైర్యమునుబూని వానిని వెంటనే పోని
యుఁడు.

దశ — దేవా! నేనా! నేనా! కల్ల కల్ల. నావలనఁగాదు.

రాము — జనకా! నామనవి నొక్కింత నాలింపుఁడు,

గీ. మీరు దుఃఖాబ్ధిమగ్ను లయి ♦ న్నారటంచు
జాలిలోఁగొని వనికిఁ బోఁ ♦ జాలకున్నఁ
గలుగు పాపంబులకును సిం ♦ దలకు నేను
గంబునెత్తుకఁ దిరుగఁగాఁ ♦ గలుగుదింక.

గీ. భువిఁ బాపాత్ముఁ డొక్కండు ♦ బుట్టి పితృ
వాక్యపాలనమును దగ్ధ ♦ పరచి భాను
వంశమునకొక్క మచ్చఁగ ♦ ల్పనొనర్చె
నంచు దూషణసేయరే? ♦ యార్యులెల్ల.

అదిగాక,

గీ. ఇపుడుపోకున్నఁ బినతల్లి ♦ కెంతయేని
కోపమును వృద్ధిఁజేసిన ♦ కుటిలునగుదుఁ
గాన నామాటవిని ధైర్య ♦ మూని నాదు
వందనంబులఁ గొనివేగఁ ♦ బంపుఁడయ్య,

దశ — తండ్రీ! పినతల్లిగాదు. నీకు శనిగ్రహము. నాకుమహామారి. శనిగ్రహమైనను యేడేండ్లకు వదలును. ఇది పదునాలుగేండ్ల శనిగ్రహమురా! నాయనా!

రాము — అయ్యమ్మనుదూరకుఁడు. తండ్రీ! ఓవసిష్ఠమహర్షి చంద్రమా! అరణ్యప్రయాణోచితములగు వస్త్రంబులఁ దెప్పింపుము.

కైక — (ప్రవేశించి) సిద్ధముగ నేయున్నవి. ఇదిగో?

లక్ష్మ—ఆఁ. పాపాత్ములారా? ఎంతపనిఁ జేసితివి? సిద్ధపరచితివా? నీగొంతున కా గుడ్డలతో నుఱిఁబోసికొని చావరాదా? ఇప్పటి వఱకొనర్చిన యీఘనకార్యము చాలకఁ దగుదువని నార వస్త్రములఁగూడ దెచ్చితివిగా?

గీ. రాఘవునియాజ్ఞ లేకుంటఁ ♦ బ్రాణములను
దీయనైతిని లేకున్నఁ ♦ దీవ్రఖడ్గ
ధార నిన్ గూల్చకుందునే? ♦ క్రూరురాల!
యొక్కమూలలను జచ్చిన ♦ ట్లుండరాదె!

రాము—ఏటికీమూర్ఖము తమ్ముఁడా! సౌమిత్రి!

గీ. పెద్దలను దూషణముఁ జేయ ♦ వద్దటంచుఁ
జెక్కుసారులు నిన్నుఁ గో ♦ పింప వినక
నేలగత్తిని దూసి యా ♦ లీలవీరి
వారిమీఁదికి నెగురఁగాఁ ♦ బాల్పడెదవు.

గీ. ఇట్టివాఁడవు నావెంట ♦ నేగుఁదెంచి
యమ్మహారణ్యమందు నా ♦ కప్రతిష్ఠఁ
జేక నెట్లుండఁగలవు? యీ ♦ దేవిధాన
నున్న నిన్నెట్లు నేఁగాపు ♦ మందు వతము.

గీ. తనసులుండెడి యమ్మహా ♦ స్థలమునందు
కూర్పదెంతగఁ జూపించు ♦ చుండవలయు
నిచట నాపినఁగాని నే ♦ నచట నావఁ
గలుగ లేకున్నఁ గలిగెడి ♦ ఫలమెఱుఁగనె?

లక్ష్మ—అగ్రజా. చెంపల వాయించుకొంటిని. క్షమింపుము.

సుమం—(ప్రవేశించి) దేవా! రథము సిద్ధపరచి తెచ్చితిని.

రాము—గురువర్యా! తండ్రీ! తల్లులారా! నా ప్రయాణమునకు రథము గూడ గొనితేఁబడినది. కాన నారగుడ్డలఁ గట్టుకొని వచ్చెదము. తమ్ముఁడా! రమ్ము, జానకీ! యీవస్త్రంబును ధరించుక రమ్ము. (అని బట్టనిచ్చును.)

సీ—(పుచ్చుకొని) చిత్తము. (అని నిష్క్రమించును.)

(రామలక్ష్మణులును నిష్క్రమింతురు.)

దశ—మునివరేణ్యా! శ్రీరామమూర్తి యెట్టుల తేజరిల్లుచున్నాఁడో! చూడుఁడు!

గీ. జడలు ధరియించి, తపసి వే • షమును బూని
నారగుడ్డను గట్టుక • నానుతుండు
గానవచ్చెడి యిపుడె సా • క్షాత్కరించి
నట్టి యీశ్వరుఁ బోలుచు • నదిగొ దేవ.

(మరల రామలక్ష్మణులును సీతయును ప్రవేశము.)

రాము—గురువర్యా!

గీ. మంచిచెడ్డల గఱపి స • న్మంచితముగ
నెల్లవిద్యలఁ బండితు • వే యటంచు
సద్యశముఁ గూర్చినట్టి మీ • చరణములకు
భక్తి నేనిదె ప్రణమిల్లు • వాఁడనయ్యా.

జనకా!

మ. తరముల్ నిక్కల నర్చనఁ గని దయా • దాక్షిణ్యముల్ జూపి నా
యుపచారంబులఁ బ్రీతి నెట్టులొ య • ట్లాయమ్మపైఁ గూడ స
త్కృపఁ జూపుఁగదయ్య యెట్టులనొ యీ • యేండ్లన్నియుఁ గడ్పి రా
జ్యపుధర్మంబుల నేర్పి తమ్మునకు, ధై • ర్యస్ఫూర్తితో నుండుమా ?

మఱియు,

గీ. చిత్త సంక్షోభ మొంది కృ ♦ శింపకయ్య
వనములకుఁ బోతినంచుఁ జిం ♦ తను ద్యజించి
నిదుర మానకుమయ్య తం ♦ డ్రి! యిదే మ
దీయ విన్నపమిది వ్యథ ♦ సేయకయ్య.

గీ. ననుఁగనుటకయి మీరలుం ♦ దిన శ్రమంబు
నందున శతాంశమును దీర్చ ♦ నైతిఁ దండ్రి
యందుకు ఫలంబుగా నిదె ♦ వందనంబు
లర్పణ మొనర్చుచుంటి ద ♦ యను గనుండు.

(తల్లి దిక్కయి)

గీ. అమ్మ! చింతను విడఁ గ ♦ దమ్మ చిన్న
యమ్మవలెఁ శోకమును జూప ♦ కమ్మ! పుత్రు
పాపకరిపాక ఫలమని ♦ భావమందుఁ
దలఁచకను ధైర్యమును బొంద ♦ వలయునమ్మ.

తల్లీ! సుమిత్రాదేవీ!

గీ. ప్రేలుమాలితి వనికి రా ♦ వలదటంచుఁ
జిన్న తమ్ముని వినక వ ♦ చ్చెడిని గాన
వాని నొక యొత్తుగా నాదు ♦ ప్రాణమొక్క
యొత్తుగా భారమును నే వ ♦ హింతునమ్మ.

అమ్మా! కైకయరాజపుత్రీ! నాయనుంగు సోదరుండగు భరతుండు ప్రస్తుత మిటలేమిగాన వానితో నా వాక్యములుగా నిటని జెప్పవేఁడెదను.

ఉ. తమ్ముఁడ! రాజ్యభారము ము ♦ దంబునఁ దాల్చుకఁ దండ్రిగారి నే
మమ్ములఁ గాంచుచుండి నయ ♦ మార్గమునన్ బ్రజలన్ సతంబు సా

ఖ్యమ్ముగ నుండఁజూచుచు ను ♦ ఖంబుగ నేలగఁదయ్యె ధాత్రి న్యా
యమ్మగు పద్ధతుల్ వదల ♦ కయ్యె దురంతము లెన్నివచ్చినన్.

మఱియు,

మ. విపరీతంబుగఁ బన్ను వేయుటలు, కా ♦ పీనంబు లోఁగొంచు ధ
ర్మపు కార్యంబులఁ జేయకుండుటలు, తపు ♦ దప్రక్రియన్ జూచి పా
పపుఁబోకన్ బడిపోవుటల్ మనకు భా ♦ వ్యంబెంతయుఁ గాదు వం
శపు మర్యాదలు పెటఁబుచ్చకను రా ♦ జ్యంబేలుమా పూజ్యవై.

ఇఁక విస్తరించి చెప్పనక్కఱలేదు. నీతివిశారదుండవు గానఁ గనుమెలఁగి ప్రవర్తించి యిక్ష్వాకుకులంబునకు వన్నెఁదెమ్మని వచింపుము తల్లీ! ఇఁక నీకుఁ జెప్పఁదగినదేమున్నది.

మ. ఒకవేళన్ జనకుండు నీవయిన గో ♦ త్రోద్రేకుఁడై యుండినన్
పకలంబీ పొతెటంగియుండుట మన ♦ స్తాపంబుఁ బోనాడి వా
నికి సేవల్ బొనరించి యెట్లయినఁ దం ♦ డ్రిన్ బ్రోవుమా! యమ్మ! నే
నిఁకఁ బోదున్ సెలవిమ్మ! సత్కృపవదెం ♦ తేఁ దాల్చుచున్ నెమ్మదిన్.

కైక—నాయనా! రామచంద్రమూర్తీ! నాపై యాగ్రహమూనకుము. పోయిరమ్ము. ఓర్వలేమిచే నీపినతల్లి యిట్లొనర్చెనని దూషింపకుము. జానకీ లక్ష్మణులారా! మీకెల్లరకు శుభం బగుఁగాక.

లక్ష్మ—గురువరా! తండ్రీ! తల్లులారా! నమస్కృతులు. నాకు సెలవొసంగుఁడు.

సీత—అత్తలారా! వందనములు. పోయివచ్చెదను.

కౌస—సీతమ్మతల్లీ! ఎంతధన్యాత్మురాలవమ్మా! నీకు జయంబగును గాక పోయిరమ్ము.

రాము—సీతాలక్ష్మణులారా! మన మాలసించిన కొలఁదియు వీరు మేటల దుఃఖాకులచిత్తులై మనకాటంకము గల్గింతురు. రమ్ము?

(నిష్క్రమింతురు)

దశ—హా! రామా! రామా! పోవుచుంటివా? భరింపఁజాల! భరింపఁజాల! నిలువఁజాల! కాళ్ళు వడఁకుచున్నవి. మాట పడిపోవుచున్నది. తండ్రి! రాఘవా! రామా! ఓరామా! ఓరామా! పలుకవా! వెనుకకుఁదిరిగి యీనిర్భాగ్యుని మొగ మొక్కమాఱు విలోకింపవా? సుమంత్రా! ఓసుమంత్రా! రథమాపుము. అదుగో: రాముఁడావద్దనుచున్నాఁడు. నాయనా! తండ్రి! రాఘవా! ఇదిగో పరుగెత్తుకొని వచ్చుచున్నాను. (అని పరుఁగిడఁబోయి క్రిందఁబడి) ఇఁక గంగలోనికిఁ బోవడము. అయ్యో! రథమువీథి దాటిపోవుచున్నది, ఇఁక రాఘవుఁడు కనుపించఁడు. అదుగో రాముఁడు, కాదు. కాదు. అవును. రాముఁడే, రాముఁడే! నాకొడుకే. రఘురాముఁడే! కాదు. కాదు. ఇఁక నీనిర్భాగ్యున కట్టి భాగ్యముకూడనా? రామా! రామా! నేనింక గుండెవ్రీలి చావవలసినదేనా? మునిశాపంబీరూపంబుగాఁబరిణమించెనా? రామా! జగదభిరామా! పట్టాభిరామా! భానువంశాబ్ధిసోమా! సద్గుణ ధరంధామా! నిర్మలయశఃకామా! రామా! రామా! రామా! హా రామా! రామా! రా-మా రా-మా రా-మా రా—మా హా-రా-మా!

(అని మూర్ఛిల్లును)

వశి—అమ్మా! కౌసల్యాదేవీ! రాముఁడరణ్యములకుఁబోయెను. విచారించిన నేమిప్రయోజనము! మహారాజమూర్ఛాగతుఁడైనాఁడు. నెమ్మదిగ వానిని మంచముపైఁబరుండఁబెట్టుట యుక్తము.

(అని అట్లు చేయుచుండఁ తెర దింపవలెను.)



శ్రీరామచంద్ర.

# పాదుకాపట్టాభిషేకము.

## పంచమాంకము.

(ప్రవేశము:- కైక. భరతుఁడు.)

భర—తల్లీ! ఏమమ్మా! నేఁడిట్టులుంటివి.

కైక—నాయనా! ఏమని తెల్పుదును? మీనాయనగారు మమ్ముల నందఱిని దుఃఖసముద్రమున ముంచి పోయిరి,

భర—ఏమీ! నాతండ్రిగారు మరణించిరా! హా తండ్రీ! దశరథా!

గీ. ముక్కు పచ్చలారని మమ్ము ♦ దిక్కులేని
వారలనుగాఁగఁజేసి ది ♦ వంబునకుఁ
జేరితివె? యెట్టిదుర్వార్త ♦ చెవులఁ బడియె
నకట యీగతి ప్రాప్తమా ♦ యరయనైతి.

జనకా! రవికులతిలకా!

గీ. పరసుతులకంచు నన్నిమ ♦ స్వాంతరములు
తరముఁ జేసితివో! తండ్రి ♦ తద్ఫలంబుఁ
దీర్చుకొననీక మాకువి ♦ ధించినావె
ఘోరపాతకమునఁ బడు ♦ క్రూరశిక్ష.

భర—ఎక్కడకుఁ బోయెను?

కైక—సీతాలక్ష్మణ సహితుఁడై వనముల కరిగెను.

భర—ఏమీ! వనములకరిగిరా? హా! తండ్రీ!

గీ. సుతుల నలువురిఁ బడసియు ♦ మృతి సమయము
నందు నొకఁడేని లేక యా ♦ చందమునను
దిక్కులేకుండఁ బోయితో ♦ అక్కటా! వి
ధాత వ్రాసెనే? నీఫాల ♦ తలమున నిటు.

జనకా! నీవు బ్రదికిన బ్రదుకునకుఁ జివఱకు నిన్ను చితిపైనఁ బెట్టి దహన మొనర్చుట కొక్క పుత్త్రుండైనఁ జెంత లేక పోయెనా? తండ్రీ! ఎంతటిగతిసంభవించినది? తల్లీ! రామచంద్రుఁడు బుద్ధిపూర్వకముగఁ దానే వెడలెనా? లేకఁ దండ్రిగారంపిరా?

కైక—తండ్రిగారే పంపిరి! నాయనా!

భర—అమ్మా! వృద్ధాప్య దశయందుఁ దానస్వస్థతగానున్న కాలంబునందు శ్రీరామచంద్రుని వనంబులకుఁ బంపు నవుసర మేమి కలిగినది?

కైక—నాయనా! చెప్పెదను కూర్చుండుము.

భర—తల్లీ! సావధానుండనై విందును.

కైక—తొల్లి దేవాసుర యుద్ధంబున నేను మీతండ్రిగారికి సహాయ మొనర్చినపుడు నాకు రెండువరంబు లనుగ్రహించి సమయము వచ్చినప్పుడు కోరుకొందునన వల్లెయని సమ్మతించె. ఆ వరద్వయంబును యిప్పుడుకోరుకొంటిని, అందుఁ బదునాలుగేండ్లు రాముఁ డరణ్యవాస మొనర్చునట్లును, నీమేలుఁ గోరినదాన నగుట రాజ్యంబునకు నిన్నుఁ బ్రభువుని జేయునట్లు నైయున్నది.

భర — ఆఁ. ఆఁ. ఏమంటివి? రాముఁడు, సకలసద్గుణపరంధాముఁడు రఘుకులాబ్ధిసోముఁడు. నిర్మలయశఃకాముఁ, డరణ్యావాస మొనర్చుటయును, నేను రాజ్యం బేలుటయునా? హరిహరీ! ఎట్టి దారుణవార్త వినుటకు జీవించితిని? ఓపాపీ! ఎంతటి కార్యమాచరించితివే? నవనీతతుల్యాంతఃకరుణాసముద్రుఁడగు రామచంద్రునకా యొగ్గొనరించుట? ఓదుర్మార్గురాలా! ఈయిక్ష్వాకుకులంబున కెల్ల దురంతంబైన మచ్చఁగల్పించిననీశరీరమింకఁ గాలిపోదేమి? వరసౌధములయందు వాసమొనరించి తతహంసతూలికా తల్పంబులపైఁ బవ్వళించి, సూర్యరశ్మి యెట్టిదో యెఱుంగక, సకలరాజభోగంబు లనుభవించు సీతామహాసాధ్వి కూరమృగసంకులంబగు మహారణ్యంబుల కరుగుచుండఁగా నీకన్ను లెట్లోర్చినవే? తులువా! ఈసాకేతపురంబు చూడనికఁహో యని కలుకుచున్న యీరాజ్యంబు పరమపాపిష్ఠుఁడనగు నా నెత్తిపైఁ గట్టనెంచి ఓకూరస్వభావురాలా! శాంతస్వభావుని నీలమేఘశ్యాముని-కరుణాసముద్రుని- పావనతేజుని-భానుకులశిరోభూషణుని-యుగ్రాటవుల పాలొనర్చుటకు నీమనం బెట్లు లంగీకరించినదే? పాతకీ! ధర్మాధర్మవిచక్షణం బింతేని లేక-నీతి లేక-మానాభిమానంబులకురోసి- పాపభీతినివదలి- యిట్టి దుష్కార్య మాచరించిన నిన్నుఁ జూచినఁ బంచమహాపాతకంబులు సంభవించునుగదే? తుచ్ఛురాలా! వృద్ధాప్యదశయందుఁ దండ్రిగారి నిట్టి తుచ్ఛపుకోర్కెలఁగోరి నిష్కారణంబుగా వాని ప్రాణంబులఁ గొంటివే! కలుగాకీ! నీనాలుక నీఖరాసిని వేయి చీలికలుగాఁ జేసినను నాకీ ధరామండలంబునఁ బాతకము సంభవించునే? అయ్యో! రామభద్రా! ఆవిపినంబులకుఁ బోవుమ

నన్నుఁ దలంచి యెంత దురపిల్లితివో ? ఎంత దూషించితివో ? హా ! రామచంద్రమూర్తీ ! ఈపాతక కార్యం బొనర్చుటయందు నేనుఁ గూడ భాగంబుఁ బంచుకొంటినని యెంతవిలపించితివో ? మహాత్మా ! అభీకరారణ్య ప్రదేశమున కెంత వగచితివో ? ఛీ ! ఛీ ! ఎంత పొరఁబడుచుంటిని ? జగదేకరక్షకుండగు శ్రీరామచంద్రుఁడా యట్లు విలపించుట ? రామచంద్రా ! పాపపుణ్యంబులరయక - శాస్త్రనియమంబు లెఱుంగక - యుక్తాయుక్త విమర్శనము లేకఁ దుచ్ఛరాలై - హేయభాజనంబగు నీకార్యంబునకుఁ గారణభూతురాలైనట్టియుఁ గన్నమాత్రంబున నే నాకుఁ దల్లియైనట్టియు నీపాపాత్మురాలి - నిక్రూరస్వభావురాలిని - మదీయనిశితఖడ్గమున కెఱఁ జేసి జన్మపవిత్రతకొఱకు నీపాదసేవఁ జేయుచు నాజన్మంబుఁ గడుపుకొన వచ్చుచున్నాఁడ. ఇదె వచ్చుచున్నాఁడ. ఓగోముఖవ్యాఘ్రిమా! తలగడ దిండువలెఁ బ్రక్కఁ జేరి త్రాచుబామువై మహారాజప్రాణంబుల బలిగొని, నిరామయుని - నిరంజనుని - మునిలోకపూజితుని - పీతాంబరధరుని - ఆజానుబాహుని - నిర్మలుని - సత్యప్రియుతుని - పితృవాక్యపరిపాలనాధురంధరుని - శ్రీరామమూర్తిని ఘోరారణ్యముల పాల్జేసి యెంత కడిగిన ముత్తెమువలెఁ గూరుచుంటివే ? ఈపాపాన్వితంబగు పాడురాజ్యంబును, యీయపకీర్తి యుతంబగు రాజ్యంబును, నామెడకుఁ దగిలించి నన్నే విధమునైన యీశ్మశాన రాజ్యంబునకు ఱేఁడుగాఁ జేసి ధన్యునిఁగా నొనర్పుమని నీతో మొఱఁబెట్టుకొంటినా ? ప్రతిమాలుకొంటినా ? వేఁడుకొంటినా ? దేవురించితినా ? సతతంబును శ్రీరామచరణారవింద భజనానందుఁడనై చరించు నాకును

రామునకు నెపంబాటు కలుగఁజేసి కులుకుచుంటివా? ఓపరమా ముఖ విషకుంభమా! వజ్రశాణిక్య సదృశంబగు నీశరీరమిచ్చు డినుక నమ్మాటలచేఁ గొట్టించినమాత్రము లోఁగునా? ఓ భావ్యురా! నీకులంబెల్ల నాకులంబొనర్చి వంశపావనుండైన రఘురాముని వనంబులకు బ్రవాసముపర్పఁబంపి యింకెంత కాలమో మనఁదగిన తండ్రిగారిని ప్రాణంబుల బల్మిని బలిగాఁ గొనిన నీపాపురాలి నీప్రచండ కిరణములచే భస్మీభూతముఁ గావింపవేమి? భూదేవీ! పవిత్రతమమగు నీయార్యావర్తము నందు ధరాభార నివారణార్థమై యవతరించిన సుగుణముల రాసిని, యార్యుని, యిట్టియిక్కట్టుల పాల్జేసిన యీమహాపా కిని గసిమసంగవేమి? నీకు భారంబుగాఁ దోఁచుచుండలేదా? ఓకూరరాలా! నిన్నెంతదూషించినను దోషంబు లేదు. నిన్నే మి యొనర్చినను నాకడుపులోని మంట చల్లారదు.

మ. కపటవ్యాపారమొకంబుఁ బన్నుక, నర ♦ ఖ్యాతిసర్గ మెదన్ బట్టి, వం
శపుమర్యాదల వీటఁబుచ్చ నొకము ♦ చ్చన్ బెట్టి యీలాటి పా
తపుకృత్యంబులఁ జేసినట్టినిను దు ♦ ర్యాసోగ్ర ఖడ్గాహతిన్
గృతముం జేనియు లేకఁ గూల్చినను యు ♦ న్నే! నాకుఁబాపంబిలన్.

గీ. రాముఁడో రాముఁడోయని ♦ ప్రజలుగోల
పెట్ట వారికి సాంత్వనం ♦ బెట్టఁ గూర్తు
వారి మోహములను బాపు ♦ వాఁడనింక
నేఁతిని యీనములనే క్రి ♦ హించువాఁడ.

సీ. నీనూాలమునఁగఁదా ♦ రామచంద్రుఁడు ఘోర
వనముల కేగుట ♦ పాపమయ్యె

నీమూలమునఁ గదా ♦ స్వామి నా తండ్రి ది
వంబున కేగుట ♦ పాత్రమయ్యె
నీమూలమునఁ గదా ♦ యామాడ్కిఁ దండ్రికి
నన్నుకు నేడ్పుట ♦ పాత్రమయ్యె
నీమూలమునఁ గదా ♦ రామరాజ్యము నేఁడు
పాదయిపోవుట ♦ పాత్రమయ్యె
గీ. అకట నీమూలమునఁ గదా ♦ అర్కవంశ
మహితకీర్తులుఁ బాలయి ♦ యలరవలసె
నట్టి జ్యైయములకు మూల ♦ మైనయట్టి
పాపివగు నిన్నుఁ గూల్చెడి ♦ వాఁడనిపుడ.

(అని కత్తి యొరనుండి తీయును.)

నేపథ్యమునఁ)

కుమారా! కర్మానుభవమునకు వగవక నాయమ్మపై నేల దూకెదవు? శాంతింపుము. స్త్రీహత్యా పాతకదోషంబుఁ జెందకుము. మీయమ్మ కోర్కెరీతిని రాజ్యంబుఁ బూజ్యంబుగా నేలుకొనుము.

భర — ఓ పాపురాలా! అటు వినుము. కౌసల్యాదేవి వాక్యంబులను, ఆమె పలుకులు శూలములవలె నాటుచున్నవే? నీమూలమున నాకు నీవు తల్లివై జనించిన కారణంబున, నాతండ్రి పాలిఁట విషసర్పమవై దాపురించిన గతంబున, రాఘవుని పాలిఁట భయంకర స్వరూపిణివై కృత్యవైనందున యెంతటి కఠోరవాక్యముల వినవలసి వచ్చెనే? దైవమా! నాయీ పాపమెడంగుటెట్లు? నాయీ తనువు ధన్యతఁ జెందుటెట్లు? ఏమనుచున్నావు? (పైకిఁ జూచుచు)

గీ. నారల ధరించుకను జటా ♦ ధారివగుచు
వనములకుఁ బోయి శ్రీరామ ♦ భద్రపాద
ములకుఁ సాగిలఁబడు దేనిఁ ♦ దెలుపుఁ దవ్వి
ధానమని చెప్పుచున్నావె? ♦ ధర్మమూర్తి.

సర్వలోకాధారా! పాహిమాం, పాహిమాం. అట్లనేయాచరించెదను. ఓ క్రూరస్వభావురాలా! నాకీరాజ్యంబుతో నేమియుఁ బనిలేదు. కావున,

ఉ. ఈధనధాన్య సంపదల ♦ నెల్లనుమూటను గట్టుకొంచు దు
ర్బోధ పరాయణత్వమున ♦ బుత్రికి నీశిరమందుఁదాల్చి యే
సాధనచేతనైనఁ బడి ♦ చావుము సంద్రములోన దూకుమీ
బాధలు నాకునేలఁ గుల ♦ పాంసని! సిగ్గిఁ జూచుకొమ్మికన్.

గీ. రాఘవుఁడు లేని భూమి, ధ ♦ ర్మంబు లేని
ధరణి, పాపాన్వితంబగు ♦ ధర, శ్మశాన
మునకు సమముగ నుంట నే ♦ మనగఁజాల
నిందుఁగావునఁ గానల ♦ యందు నిలుతు.

నేనింక నీమొగంబుఁ జూడఁజాల! అవలకుంబొమ్ము. నీవు నాకుఁ దల్లివిగావు. నేను నీకుఁ బుత్రుఁడను గాను. పొమ్ము. పొమ్ము.

గీ. తల్లి కౌసల్య నన్ను కొం ♦ తంబుఁ బూను
డోయి తనయా! యనుటనిను ♦ నెంచనైతి
లేకయుండిన నీవలె ♦ కీకృపాణ
మునకు నిన్నుఁ బలిచేయనే ♦ మూర్ఖురాల.

కైక—కుమారా!

భర—ఛీ! ఛీ! ఇంకను కుమారాయని యేమో చెప్పఁబోవుచున్నావు. చాలు. చాలు, కలువరినోటిలోఁ బడెదమను వెఱపులేక, నీతి లేక, చేసిన ఘోరాఘన కార్యముల కొఱకు మూలఁ బడ్డినటులఁ బడి యేడ్వలేక నింకఁ గుమారాయని పిలుచుచున్నావుగా ? నిర్లజ్జురాలా? నోరు మూసికొనుము.

(అంత వశిష్ఠుఁడును, కౌసల్యా సుమిత్రలును ప్రవేశము.)

భర—గురువర్యా! వందనంబులు. తల్లీ! కౌసల్యాదేవి!

గీ. రాజుగానున్న రాము న ♦ రణ్యమునకుఁ
బంపి పావనమగు భాను ♦ వంశమందు
మచ్చఁబెట్టిన యిమ్మహా ♦ మారి సుతుఁడ
మ్రొక్కుచున్నాఁడ నీపాద ♦ ములకు నిటుల.

కౌస—బాలకా! యీయమ్మనేల దూషించెదవు? పెద్దలశాపంబూరక పోవునా ?

భర—తల్లీ! నీవెంతఁ దెల్పినను నామనంబంతయు శ్రీరామచంద్రునిపై నున్నదమ్మా ?

గీ. ఎవ్వఁడాగహాన సీమకు ♦ నేగి రాము
భద్రపాదంబులకు మ్రొక్కి ♦ వానిఁ దెచ్చి
పట్టభద్రునిఁ జేసెడి ♦ వాఁడనో యు
టంచు నామది తొందర ♦ రించుచుండె.

గురువర్యా! శ్రీరామచంద్రుని యొద్దకుఁ బోవుటకిప్పుడు సమయమేనా ?

వశి—భరతా! సమయాసమయ విచారణ మిప్పుడుఁ జేసికొనవచ్చును. ముందు నీరాక కెదురుచూచుచుఁ దైలఘటంబున భద్రపరచిన

మీతండ్రిగారి కుచితక్రియల నెఱవేర్పవలసి యున్నది. ఇంక వాపుటకు వీలులేదు.

భర—ఆర్యా ! ఇదంతయు నెఱవేరిన పిమ్మటనేనా ?

గీ. సుతులు నల్వుర మేమొక్క • చోటఁ గూడి
మామహారాజు కొలఁకింత • యఘువహించి
కర్మ సూత్రింబునకు దూరి • కార్య శేష
మును బొనర్పుటలు వశిష్ఠ • మునివరేణ్య.

వశి—ఏది యెట్లుండినను ముందిచ్చట జరుగవలసిన విధివిధానంబులు దప్పవుగదా !

భర—తల్లులారా ! ఎంత చిత్రము జరిగినది ? ఎట్టినాటకము జరుగుచున్నది.

మ. వ్యసనాబ్ధింతి యెఱుంగకేఁ సతత సౌ • ఖ్యానంద వారాశిధిన్
మనలన్ దేలిన మిమ్ముఁ జూచుటకునై • మాయమ్మ కండ్లార్ప కీ
దొనఁగుల్ జేసి యకృంబు మాటఁగలిపెన్ • దుష్టత్వ మింతొప్పునే
తనపుం గుంకుమ నేఁటితోడ విఫల • త్వంబయ్యెనే మీకహా.

అమ్మలారా !

మ. భరతుండింతటి దుష్టుఁడాయని దలం • పన్ బోకుఁడీయిట్టి దు
ర్భర సంతాపమునింత కృత్యము లోన • ర్పన్ బొప్పునాతల్లియం
చెఱుఁగన్ నావయిఁ గిన్కఁబూనకుఁడి యు • ద్వేగము న్నాడనా
గురుపాదంబులు సాక్షిగాఁ బలికెదన్ • గోపంబులన్ వీడుఁడీ॥

ఓ వశిష్ఠమహర్షి చంద్రమా ! ఈకట్టడి కార్యంబున నా
పాపం బింతయేని లేదని మీయంతరాత్మసాక్షిగా నమ్మెదరా?

వశి—అటులెవ్వరుఁ దలంపలేరు. అందులకు నేనే సాక్షిభూతుఁడను. రండు పోదము. కాల మతిక్రమించుచున్నది.

భర — తల్లులారా!

గీ. తలవని తలంపుగానిట్లు ♦ గలిగెనంచు
దైవగతికింత యేడ్చి నా ♦ తండ్రిగారి
మృతకళేబరముజూచి ♦ యింత యేడ్చి
చేయవలసిన దంతయుఁ ♦ జేతురండ్రు.

అమ్మలారా! ఒక్క విషయమునకు మాత్రము మఱింత ఖేదపడుచున్నాను.

గీ. జ్యేష్ఠసుతుఁడయి, లోకమం ♦ దెవ్వఁడైన
రాఘవుని జేతులార కా ♦ ర్యక్రియంబు
జరిగియుండినఁ దండ్రికి ♦ సద్గతులు ల
భించుఁగద యట్టివాంఛ న ♦ శించిపోయె.

(తెఱగో)

గీ. రాఘవుని గానములఁ జే ♦ ఱఁగను జేయఁ
జేసితివి బోధలను మూర్ఖ ♦ చిత్త! మంధ
రా! నను మిక్కుడట ఖడ్గ ♦ రాజమునకు
బలిగనొసరింతు భరతు కో ♦ పంబుఁదీఱ.

కౌస — భరతా! ఎచటిదా కోలాహలము? వినుము.

భర — తల్లి! ఎచ్చటిదా? మఱలవినుము. నీకే తెలియగలదు.

(తెఱలో)

గీ. రవికులాగ్రేసరుఁ శ్రీ ♦ రామచంద్రు
వనములకుఁ బంపుటందుఁ గా ♦ రణముదీని
బోధయగుటను నాదగు ♦ క్రోధశాంతి
గాఱకు దెచ్చుచునుంటి సం ♦ బరముతోడ
భరతుఁ డెటనున్నవాఁడో తె ♦ ల్పంగ వలయు.

భర—అమ్మా! తెలిసినదా! శ్రీరాము వనవాసమునకుఁ గారణ భూతురాలైన మంధరను శిక్షించుటకై యిచటకుఁ దెచ్చుచున్నాఁడు.

కౌస—నాయనా! మన గతులిట్లుండగా దానిపైఁ గ్రోధమేల? కావున నామాట వినఁదలంతువేని దానిని వదలిపెట్టుమని చెప్పుము.

భర—చిత్తము.

శత్రు—(ప్రవేశించి) అగ్రజా! మన తల్లిగ కైకేయిగ నుండఁదగిన యన్నగారిని వనంబునకుఁ బ్రవాసమంపుటకుఁ గారణభూతురాలైన యీకురాత్మురాలిని బట్టి తెచ్చితిఁ గావునఁ దగిన శిక్షల విధించి నన్ననుగ్రహింప వేఁడుచున్నాఁడ.

భర—తమ్ముఁడా? శత్రుఘ్నా! శిక్షించుటకును. రక్షించుటకును నేనెవఁడను? పెత్తల్లిగారి యాజ్ఞయైనది. కానఁ గన్నమాత్రింబునకు వగచుచు నామెను విడచిపుచ్చుము.

మంధ—దేవా! అపరాధిని మన్నింపుము. బుద్ధిగడ్డితినిచేసిననాపాపం బుడుగింపుఁడు!

శత్రు—ఛీ! పాపాత్మురాలా! నీదినము బాగుండుటచే బ్రతికితివి. పొమ్ము?

మంధ—(నిష్క్రమించును.)

భర—గురువర్యా! తల్లులారా! కాలాతిక్రమణం బొనర్పనేల; పోయి విద్యుక్త ధర్మంబుల నెఱవేర్తము రండు.

(అందఱు నిష్క్రమింతురు.)



శ్రీరామచంద్ర.

# రామపట్టాభిషేకము

షష్ఠాంకము.

ప్రథమరంగము—చిత్రకూటపర్వత ప్రాంతారణ్యము.

(ప్రవేశము సీతారాములు.)

రాము—ఓ జనకరాజపుత్రీ! సింహశార్దూలాది క్రూరమృగంబుల చే భయంకరంబగు ఘోరారణ్యములయందుం జేరి పడరాని యిడుములం బడుచు నామూలముననేకదా! యీసూదిరాళ్లపైం బయ్యెద కొంగుం బఱచికొని పరుండితివి. ఓజానకీ! శుద్ధాంతసౌధములయందు సమవయస్కలగు సఖీజనంబులు కొలుచుచుండ సర్వసుఖోపేతవై యలరారు నీవు నామూలముననేకదా! యీకంటకశిలావృత యగు వనస్థలంబునం జేరి కందమూలాది ఫలంబులం దిని కాలంబు గడపుట. ఓసీతాసతీ! సతతంబును దివ్యభూషణాలంకారశోభితవై విలసిల్లు నీవు నామూలముననేకదా! నారగుడ్డల ధరించి కాంతారంబునం జేరి యవస్థలంగుట కర్కశతమంబులగు నీకష్టంబులం దిలకించుచు కొలంది నాగుండె లవియుచున్నవి గదా! సాధ్వీరత్నమా!

నీవీ నిర్భాగ్యునిఁగాక మఱియొకమహారాజును జెట్టఁబట్టినచో నీకిట్టి దురంతకష్టములు వాటిల్లకుండెడివేమో? ఇంతీ! ఇంతింతనరాని వంతలపాలైనను స్వాంతంబున నావంతయుఁ జింత నొందని నీయంతరాత్మ నెంతని కొనియాడుదును ? జనకుని కూతురవై, దశరథేశ్వరుని పెద్దకోడలవైన నీకా యీ కష్టంబులు ? వలదని యెంతవారించినను వినక యెండవానలకోర్చి ఈ మిట్టపల్లములలో నా ముండ్లత్రోవలలో శ్రమ యనుకొనక భరించి వచ్చిన నీధైర్య మేమందును ?

సీత—నాథా ! మీరిట్లాడఁదగునా ? చూఁడుఁడు.

గీ. దగ్గఱను జేరి వేనవేల్ ♦ దాసిగాగ
ణంబు పరిచర్యలెన్ని నే ♦ సల్పుచున్నఁ
గాని పతిచెంత లేని యా ♦ మాన్మవతికి
గతులు గల్గునె? ఘోర దుం ♦ ఖములుగాక.

మఱియు,

గీ. కష్టములు వెన్ని గల్గినఁ ♦ గాని పతిని
నాతి యెన్నండుఁ బాయని ♦ మానినీయు
రాలి కిహమునఁ బరమున ♦ రాదె కీర్తి
యుభయలోకపూజిత యని ♦ యో హృదీశ.

అందుచేత,

గీ. మందిరారామసీమల ♦ యందునుండ
కుండినను భూషణములు లే ♦ కున్నఁగాని
దాసికావర్గసేవలు ♦ దగ్ధమైన
రామ సీతోడిదే లోక ♦ మో ! మహాత్మ.

గీ. అనుచు హృన్మందిరమునఁ గ ♦ ల్గిన ప్రియోద
మునను మీవెంట వనతలం ♦ బునకువచ్చి
నట్టినన్నుఁ జూచి మీరలి ♦ ట్లనఁగనగునె?
దేవ! మిము బాయకుంటయే ♦ గావలయును.

రాము—ప్రేయసీ! నాయందలిఁగల యనురాగాతిశయముచే నట్లం
దువుగాని,

సీత—నాథా! ఉండుఁడు. ఎచ్చటనో పెద్దధ్వని వినవచ్చుచున్నదిం
దుర్మార్గులైన దానవులు కారుగదా?

రాము—అయిః మాత్రి మేమిభయము!

గీ. లోకకళ్యాణ మొనరింప ♦ నాకుఁ బెద్ద
లిచ్చినధనుస్సు ఖడ్గము ♦ ల్లివిగో గనుము
యివ్వినాచేతనుండ నిం ♦ కేటిభయము
దిగులువీడుము నెమ్మదిఁ ♦ జిగురుఁబోఁడి.

దేవీ! అల్లదిగో చూడుము. లక్ష్మణుఁడేటికో తొందరగాఁ
బరువెత్తుకొని వచ్చుచున్నాఁడు.

(తెరలో)

ఓరోరీ! మహాపాతకవర్తీ! దురాత్ముఁడా!

మ. భరతా! రాజ్యమునెల్లఁ జూరఁగొని పా ♦ పంబంచు నూహించ క
క్రూరణి రాఘవుకానలందు నిలుపం ♦ గాఁ బంపుటల్ చాలక
కరుణాదూరుఁడవై రణంబునలుపం ♦ గా వచ్చుచున్నావురా!
దురితస్వాంతుఁడ రార! యాశరమునన్ ♦ ద్రుంతున్ని మేసంబులో.

తే. గీ. తోడఁబుట్టినవానిని ♦ ద్రుంచితినని
నిందఁ జేకూఱుఁగాక నో ♦ వందనిన్ను

పాపమునకింత వెఱువక ♦ వ్రిక్కలించి
ముక్కలుగఁజేతురా యుద్ధ ♦ మునకు రార.

లక్ష్మ—(ప్రవేశించి)

శా. అన్నా! చూడుము సింధుసైన్యములతో ♦ నానందుఁడై యాజికి
సన్నాహంబున వచ్చుచుండె శరముల్ ♦ సంధించి సిద్ధంబుగా
నున్నంగాని ప్రయోజనంబుగనవే ♦ మోహాంధదురాత్ముండయీ
సన్నాహంబును జన్న నేమి కతమో ♦ భవ్యాత్మకా! రాఘవా!

(భరతు నుద్దేశించి)

ఓరీ! పాపాత్ముఁడా! భరతా! ఎంతటి తుచ్ఛకార్యంబునకుఁ బాల్పడుచుంటివిరా? నిర్వికారుని, సర్వకాలసుఖోపేతుని, శ్రీరామమూర్తిని వనవాసంబున కంపినదిచాలక నయోధ్యా రాజ్యపాలనం బూడఁగొట్టి నెత్తిపైఁ బెట్టుకొనునది చాలకఁ, బెద్దసైన్యమును గూర్చుకొని యుద్ధంబునకుఁ గూడ వచ్చితివిరా? నీకీదుర్బుద్ధి యేదుర్బుద్ధి బోధించెనురా? లోకైకవిఖ్యాతుఁడగు శ్రీరామమూర్తిని సంహరించి గురుహత్యాపాతకంబును గూడ మెడకుఁ గట్టుకొన యత్నించితివిరా? దురాలంభుఁడా! మదీయ బాహుబలాతిశయంబున నిన్నంతలయంబున కంపి నీతల్లిని పుత్త్రికావిహీనురాలిని గావింపకున్న నేను రామానుజుండనే నా?

రాము—(అపవారించి) తమ్ముఁడా! ఏటికాతొందర? నీక్రోధంబును జాలించి నావంకఁ జూడుము.

గీ. భరతుఁడేమి? నన్నెదిరింప ♦ వచ్చు టేమి?
యతఁడు ధర్మవిదూరుఁడే? ♦ మతియొకింత

లేక నీలీల వానిపై ♦ లేనిపోని
వాదు లేటికి మోపెడి ♦ వాఁడవీవు.

లక్ష్మ—అన్నా ! నాకు మతిలేదా ? వానిపై లేనిపోనివాదులు మోఁప నాకేమంత గ్రహచారంబు పట్టినది ? అటువైపునఁ దిన్నఁగాఁ జూడుఁడు,

గీ. పాపచింతనమే లేక ♦ భక్తియెల్లఁ
బోవిడచి సిలుగులం బెట్టి ♦ బుద్ధితోడ
ధనువును ధరించుకొనుచు యు ♦ ద్ధము నొనర్ప
వచ్చుచున్నాఁడు భరతుఁడో ♦ భవ్యచరిత.

రాము—లక్ష్మణా ! భక్తియుతుండగు భరతుండు నాపై నెన్నఁడట్టి ద్రోహమును దలంచువాఁడు కాఁడు. వానిరాక కేదియో విశేష కారణముండి యుండవచ్చును. ఐనను గుడువఁబోవుచు నీ కూరాకు రుచు లిప్పుడేల ?

(తెరలో)

గీ. రాజ్యసర్వస్వమును బాసి ♦ రమణితోడ
సోదరునితోడ వనముల ♦ నుగ్రుక్కుచున్న
రామ ! శ్రీరామ ! జానకీ ♦ రామ ! యేడ
నుంటివో ? వేఁగ దర్శన ♦ మొసఁగ రాదె ?

రాము—వింటివా ! లక్ష్మణా ! భరతుని పలుకులను, వాని నిజాభిప్రాయము నిప్పటికేని గుర్తించితివా ? నేగ్రహించినంత వఱ కాతఁ డింటికివచ్చి యీ యుదంతంబంతయు నారసి, విచారపడి, మొట్టులేని నన్ను బ్రతిమాలి గొనిపోయి రాజ్యాభిషేక మొనర్ప వలయునని యాతని యాశయమైనట్లుగాఁ దోఁచెడిని.

లక్ష్మ—అగ్రజా! ఆతని దీనసంబోధనంబుల వలన నట్టులనే గ్రహించితిని. అజ్ఞానవశుండనై పలికిన పలుకుల క్షమింపుఁడు,

(వశిష్ఠ సహితుఁడై భరత ప్రవేశము.)

భర—దేవా! వశిష్ఠమహర్షి చంద్రమా!

మ॥ వరపీతాంబరధారి రాముఁడు; జగ ♦ ద్వంద్యుండు; నిత్యుండు; భా
స్కరవంశాంబుధి సోముఁడా ర్తజన ర ♦ క్షాదక్షుఁడీరీతి దు
ర్భరసంతాప నిమగ్నుఁడై చును జటా ♦ వల్కంబులన్ దాల్చి కా
పురమున్ సల్పుచునుండఁగాననటులన్ ♦ మీ మెత్తురే జాడదన్

గీ॥ కైకమూలాన సర్వలో ♦ కైకనుతుఁడు
యిటుల బాధించుచున్న నా ♦ హీనబుద్ధి
కెంత వగచుదు? సముఁజూచు ♦ నంతనేమి
యనుదు? నాకేమియును దోఁచ ♦ దయ్యె నిపుడు॥

వశి—భరతా! ఇంతదూరముదాక ధైర్యముగావచ్చిన నీకు మాఱల నీవిచారమేటికి? అదుగో సీతారామలక్ష్మణులు. వారిని గలిసికొందము రమ్ము. (పరిక్రమింతురు.)

రాము—తమ్ముఁడా! లక్ష్మణా! వశిష్ఠభగవానులను వెంటఁబెట్టుకొని భరతుండదె వచ్చుచున్నాఁడు. నీవేమియుఁ దొందరపడవలదుసుమా?

లక్ష్మ—ఆజ్ఞ.

భర—(సమీపించి కేల్మోడ్చి)

చ॥ పుడమిభరించి భోగములఁ ♦ బొందుచునుండుటఁ జూడలేక నీ
వడువునఁ గానలందున ని ♦ వాసముసల్పఁగ బంపి; ఘోర నిం
దలకయి కొంగుకట్టి, యల ♦ తండ్రిని బాపిన పాతకుండఁ ద
మ్ముఁడ! భరతుండ! యీగతిని ♦ మ్రొక్కెదు నీకిదె రామభూవరా!

రామ, లక్ష్మ— (ఆతురతతో) భరతా ! లెమ్ము. లెమ్ము. ఏమీ తండ్రిగారు మరణించిరా ? ఎంతదారుణము. హాతండ్రీ!

(అని మూర్ఛిల్లుదురు.)

రాము—(లేచి) తండ్రీ! పితృవత్సలా! అనుకొన్నంతయు జరిపితివా ?

చ॥ నను నెడబాసితంచును మ ♦ నంబున బెగ్గిలి; తిండితూని, ని
ద్రినుత్యజియించి మంచమున ♦ రాత్రిఁబవల్ కృశియించిపోతివా
తనయులనొంటిఁజేసి యెటు ♦ దాపురమయ్యెను నీకుమిత్తి ? యే
మనినిలువంగనేర్తు మక ♦ టా! యిఁకసిబ్బివి ఘోరచింతతో।

హా ! దైవమా !

గీ॥ భానుకులరత్నమును మృతి ♦ వాతఁబెట్టి
మమ్మునీరీతి దుఃఖ సం ♦ ద్రమ్మునందు
ముంచి యేడ్పించ నీకేమి ♦ మంచి కలుగు
దైవమా! యింతక్రోధంబు ♦ తగునె? నీకు।

వశి—రామా ! ధైర్యమవలంబింపుము. సర్వజ్ఞుఁడవగు నీవే యిట్లు విలపించినఁ దక్కినవారిగతి యేమి?

రాము—అయ్యా మునీంద్రా !

సీ॥ తేజాగఁగా జేయు ♦ రారాఘవా యంచు
విలపించు నవ్వాడా ♦ పించనైతి
కొడుక! సీతోఁగూడ ♦ నడవుల కరుదెంచు
చున్నాఁడ ననఁగ నే ♦ నొప్పనైతి
పుడమిపైఁ బడిదిగుల్ ♦ బొందుచుండఁగ లేవఁ
దీయుచు సేవలఁ ♦ జేయనైతి
నాచేతిలో మర ♦ ణంబుఁ జెందెడ నన్న
జనకువాంఛను దీర్పఁ ♦ జాలనైతి.

గీ॥ సకట నామూలమున తన ♦ కంతలేసి
కష్టములు ప్రాప్తమైనను ♦ గన్నకొడుకు
నగుటఁ జేతికి నాధార ♦ మగును ప్రాప్తి
కలుగదయ్యెను ధైర్యమె ♦ ట్టులనుగాంతు॥

హా! తండ్రి!

మ॥ వరసాకేతపురంబు నేలుచు భవ ♦ ద్భారంబులన్ దీర్చుచున్
సిరిసంపత్తుల వృద్ధిఁ జేతునని యెం ♦ తో నాశతో నున్న నీ
వరవాంఛల్ నెఱవేర్పనైతి సకటా! ♦ పాపంబిటుల్ పిద్దరా
టరయన్ బాలకహాతి బ్రహ్మలిఖితం ♦ బన్యాయమై యుండుటన్॥

తమ్ముఁడా! భరతా! నీవు నిక్కముగా ధన్యుఁడవోయి!

గీ॥ నిక్కమగు పుత్త్రకుఁడనౌట ♦ నీకుఁదక్కఁ
జేతిమీఁదుగ మట్టిని ♦ జేయుఫలము
ధన్యుఁడవునీవు! మేము పు ♦ త్త్రకులమైనఁ
గాని శత్రులమైతిమి ♦ గాదె? భరత!

భర—అన్నా! ఆవిషయమునఁ నల్వురము సమానులమే యైతిమి.

రాము—తమ్ముఁడా! అట్లనుచుంటివేమి?

భర—అన్నా! ఏమిచెల్పుదును?

ఆ॥ వె॥ నేను వచ్చువఱకె ♦ నేలఁబాసి మెలంగ
ధర్మమూర్తియైన ♦ తండ్రిగారు
తైల ఘటమునందుఁ ♦ జాల జాగ్రత్తగ
నేను వచ్చుదాక ♦ నిలిపినారు॥

రాము—భరతా! సుతులము నల్వురముండియుఁ జివరకు దిక్కులేక చనిపోయినను వెంటనే గావలసిన కర్మ నడుపక శవమునుగూడ నాపి యుంచిరా?

వశి—రామా! అచటఁ గర్త లేకుండ విధ్యుక్తధర్మము లెట్లు నెఱవేఱును,

రాము—తమ్ముఁడా! తండ్రిగారు చనిపోవునప్పు డెంత బాధ పడిరో గదా?

భర—రామచంద్రప్రభూ! ఆవిషయము లెఱింగినది మన గురువులవారే.

రాము—మహాత్మతిలకమా! తండ్రిగారు మృతావస్థను బొందునప్పు డెట్లుండిరో?

వశి—ఆవిషయమునుగూర్చి నేనేమి దెల్పుదును గాని, ముఖ్యముగా నిది వినఁదగినది.

గీ॥ రాజుగానుండి నాకు భా ♦ రమును దీర్చి
భానుకులమునకు నెంతయో ♦ వన్నెఁ దెచ్చి
యశము గాంచెదవను నాకు ♦ యాశ లెల్ల
భగ్నముగఁ జేసితే రామ ♦ భద్ర నీవు!

గీ॥ అనుచుఁ బలుసారు లేడ్చుచు! ♦ హా మదీయ
రత్నమా! యొంటిఁ జేసి యీ ♦ రణ్యములకుఁ
'తివా! రామచంద్ర! సా ♦ కేత పురము
వదలి యందుకు ప్రాణముల్ ♦ వదలినారు!

రాము—హా! దశరథేశా!

గీ॥ తేరుతేని విలపించి ♦ శోకితవముఁ
జేసి మముగని పెద్దలఁ ♦ జేసెక్కవను
బ్రోచినందుకు ఫలముగా ♦ ఘోరు నేడ్వఁ
జేసినాఁడను నాపేరు ♦ మాసిపోవ!

గీ॥ రామచంద్రా యటంచు నో ♦ రారఁ బెద్ద
కేకలిడి యేమ్పునప్పుడీ ♦ వేకరణిని
బాధలందితో? చెంత న ♦ వ్వరును లేమి
నెటుల గిలగిల లాడితో? ♦ యినకులేశ॥

వసి—రామభద్రా! ఏటికీవిచారము? చనిపోయినవారు మరల వత్తురా?

గీ॥ పుట్టుట కెవ్వఁడుండునో ♦ గిట్టుటయు న
పుడె కలవవి స్వాభావిక ♦ ములు దలంప
జీవకోటికి నాటికై ♦ చింతఁబొంది
చేయఁదగు కార్యములు విమ ♦ ర్శనలేదు.

కాఁబట్టి కావలసిన కర్మనాచరింప నాకొలనుతీరంబునకుఁ బోదము రమ్ము.

రాము—చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు.)

## షష్ఠాంకము—ద్వితీయరంగము.

[రామలక్ష్మణ భరతశత్రుఘ్నులును, వసిష్ఠుఁడు మున్నగువారలు ప్ర॥]

భర—అన్నా! రామచంద్రా!

మ॥ నిను గారాటవి కంపితిన్ జనకు మా ♦ టన్ గల్పితిన్ దల్లిచే
సినమోసంబునఁజిక్కి యక్కరులవా ♦ సిన్ బూదిపాల్జేసితిన్
జనులందే నగవాస్యఁ జెందితి యిటన్ ♦ చండాలునై పోయి యే
మని జీవింతును ధాత్రిసంత రఘురా ♦ మా! నామొఱాలింపుమా॥

చ॥ కనినకతంబునన్ జనని ♦ గాఁ దలపోసెదు నట్టికైక న
న్నినకకటక్రియల్ దెలియ ♦ నేరక పోతిని నంతయేని యే

మనిదలపోయుచుంటివా హృ ♦ దంతరసీమను నేనెఱుఁగు దం
చును నెఱనమ్ముదేని నిలు ♦ చుండినపాటున భస్మమయ్యెదన్

కాఁబట్టి భానుండులేని ప్రపంచముపగిది వెలవెలఁబోవునయో ధ్యాపురంబున నుండలేక యీమునివేషంబును బూని భవదీయ చరణసేవ సలుపవచ్చిన నన్ను మన్నించి కరుణింప వేఁడు చున్నాఁడ.

రాము—తమ్ముఁడా! ఇది యేటికోరిక ? వినుము. పెద్దలవాంఛితంబుల నన్యథాపఱచుట భావ్యంబుగాదు. యుక్తాయుక్తవిచారణ శూన్యులమై యట్టియవకతవకకార్యంబు లాచరించినచో మన యిక్ష్వాకుకులంబునకు గళంకముఁదెచ్చినవారమగుదుము గదా? అందుల కొప్పుకొనెదవా ?

భర—అవును.

రాము—కావుననే దండ్రియాజ్ఞనా దలధరించి,

గీ॥ తపసివేషముఁ బూని కాం ♦ తారములకు
వచ్చినాఁడను నాదగు ♦ వంతుఁదీర్తు
రాజ్యపరిపాలనాది భా ♦ రమునుదాల్చి
వంతుఁ జెల్లించుకొనుమయ్య ♦ భరతనీవు.

భర—అయ్యా ! లోకరక్షకా !

గీ॥ తండ్రియాజ్ఞను శిరమున ♦ దాల్చిదాని
యిచ్చవచ్చినవారికి ♦ నీయనాకుఁ
దగినయధికారమున్న క ♦ రావరామ
చంద్ర! నీకర్పితముగ నో ♦ సంగినాఁడ॥

కాన నామొఱాలించి.

గీ. వదినకౌసల్యకువచ్చి వెఱ్ఱి ♦ నూడిని బట్టి
భద్రుఁడవునాదు రాజ్యధి ♦ పాలనంబుఁ
జేసికొనవయ్య మేము మీ ♦ సేవఁజేసి
కొని మెలంగెద మయ్యయో ♦ గుణ నిదాన.

రాము—తమ్ముఁడా! నీవుజూపిన భ్రాతృవాత్సల్యంబున కెంతయు సంతసించి నీదానంబుఁ బరిగ్రహించితి కాని,

గీ. మొదటఁ బదునాలుగేడు లీ ♦ విధినివన ని
వాన మొనరించివిమ్మట ♦ వచ్చి నీదు
దానముం గ్రహించి నాదు క ♦ ర్తవ్యము సార
మేలెదనుగాన భయమేల ♦ నింక భరత.

ఇందుల కంగీకరింతువేని,

గీ. తండ్రికోరికఁ దీర్చిన ♦ ధన్యు నగుదు
భానుకులసత్య వాక్పరి ♦ పాలనంబుఁ
బ్రోచుటఁ గృతార్థునౌదు నీ ♦ మొఱను సార్థ
కంబొనర్చుటచే గౌర ♦ వంబుఁ గాంతు.

భర—అన్నా!

గీ. తాము లేకుండ నేనయో ♦ ధ్యా పురంబు
బోవఁజాలను గాన నా ♦ మొఱనువిని కృ
పామతిని వచ్చిరాఘవ ♦ రామ మము కృ
తార్థులుగఁ జేయుమయ్య వం ♦ దన మొనర్తు.

రాము—తమ్ముఁడా! అధర్మకార్యంబున కిటులఁ బురికొల్పుట యుత్తమమేనా? దేశాచారమునను సరించి జ్యేష్ఠుఁడనైనంత మాత్రమునఁ దండ్రిగారి శాసన ముల్లంఘించి యిహ పరంబులకు రెంటికిఁ జెడుమందు నేమి యన్యాయమిది,

భర — అయ్యా ! గురూత్తమా ! ఈమహానుభావునకుఁ దాపైన
నచ్చఁజెప్పి నన్ను నలువురిలోఁ బడవేయు సూత్రమును జూచి
పుణ్యముఁ గట్టుకొనుఁడు.

వశి — భరతా ! ఏమి చెప్పుదును! శ్రీరాముఁడు తండ్రిగారి శాసనము
నకు బద్ధుఁడై గదా యరణ్యములకు వచ్చెను? అద్దానిని మీరి
యయోధ్యానగరంబునకు వచ్చినచోఁ బలువురిలో నగుబాటు
లకు పాలగుట నిక్కువము. తండ్రిగారిచే నీకొసంగఁబడిన
రాజ్యంబును శ్రీరామచంద్రప్రభు మొనర్చుటచే యద్దానిఁ బరి
గ్రహించి రాజ్యభారము వహించుటయు రాజునకుఁ గర్తవ్యం
బే ; కావునఁ గులగురువునగు నామాట మీరుభయులు వినఁ
దలంతురేని యిటులాచరించిన బాగుండును.

గీ. వనములోనుండినను రామ ♦ భద్రు చిత్త
మేదయిన నొందుఁ గొనిపోయి ♦ యింపుమీఱ
రామునకు మాఱుగా నీవు ♦ రాజ్యమేలు
మయ్య శ్రీరాముఁడే ప్రభుఁ ♦ డనుచుఁ జాటి.

భర — (తనలో) ఎంతవిపరీతము !

చ. జనకుని గోలుపోయి, గుణ ♦ సాంద్రుని రాముని కాననంబులం
దున వసియింపఁ బంపి, యతి ♦ దుష్టుఁడనంచు నయోధ్యయందుఁ బే
ర్గని, యపనిందఁ బాపుకొనఁ ♦ గాఁ జనుదెంచి తిరస్కరింపులం
దిన ఖలుఁడన్ మొగంబెటుల ♦ నేనిఁక నెత్తుక సంచరించెదన్.

గీ. మొండిజీవంబు లీపాప ♦ బొందినుండి
వదలకున్నవి సన్నుత ♦ భ్రాంశుఁ జేయ
దైవమా ! నాకికేగతి ♦ దయఁదలంచి
బలుకఁదగదొకో నీకింత ♦ యలుకదగునె?

ప్రమనఁగానిమ్ము. శ్రీరాముఁ డయోధ్యానగరంబును బ్రవేశిం
చువఱకు నేనాపురంబునకేఁ బోఁజాలను. (ప్రకాశముగా)
దేవా! ఏమియాజ్ఞ?

వశి—భరతా! ఆజ్ఞ కేమున్నది? శ్రీరామచంద్రుని పాదుకలఁ గొని
పోయి యభిషేకించి యీ యరణ్యవాసకాలమంతయు గ
డుపుము.

రాము—గురువులయాజ్ఞ యనతిక్రమణీయ మగుటం జేసి యట్లాచరిం
పుము.

గీ. నాకు మాఱుగ సింహాస ♦ నమున నాదు
పాదుకలనుంచి రాజ్యతం ♦ త్రపాలనంబుఁ
జేయుచుండిన సత్కీర్తి ♦ సిద్ధిఁ జెందుఁ
దండ్రివాంఛయుఁ దీఱు స ♦ త్యము నిలుచు.

భర—అయ్యా! నే నయోధ్యానగరంబునకు మరలి పోఁజాలను.
తలయెత్తుకొని తిరుగఁజాలను

వశి—అట్లయిన నందిగ్రామమున నుండి యట్టులఁ జేయవచ్చును.

భర—దేవా మహేంద్రా! అన్నా రామచంద్రా! నాదౌర్భా
ఖము గలదు దాని నన్యథాకరింపక నాయాశ జేయుము,

గీ. నాదు శిరమున సింహాస ♦ నముగ నెంచి
సంపుటాభిషేక మిప్పుడీ ♦ స్థలమునందు
నాహృదంతరసీమ సం ♦ తసము చెందు
దన్నవా! ధన్యతనుగాంచు ♦ సదయులార.

వశి—అట్లనే! రామచంద్రా! పాదుకల నొసంగుము?

రాము—చిత్తము. భరతా! ఇదిగో (అని యిచ్చును.)

భర—(పాదుకలను కళ్లనద్దుకొని శిరంబునఁ దాల్చి) ధన్యోస్మి! ధన్యోస్మి !

గీ. రామచంద్రుని ఘనకృపా • రసమువలన
దారశి శిగమెక్కినట్టి పా • దుకల మహిమ
చే నమసె సర్వపాపముల్ • జెందెఁ దనువు
ధన్యతఁ గృతార్థుఁడనైతి • ధరణియందు.

దేవా ! ఇట్లగునుగాత,

గీ. రామచంద్రుని పాదుకల్ • రాజ్యమేలి
రామరాజ్యమె యనునట్లు • రహిఁ జెలంగి
శాంతి ప్రజలందు వ్యాపించి • సత్య నియతి
వర్ధిల్లెడుఁగాత నిచ్చలీ • వసుధయందు.

వశి—తథాస్తు.

రాము—భరత ! ఇఁక పోయిరమ్ము. దేవా ! వందనంబులు. మేము దండకారణ్యమునకుఁ బోయి పర్ణశాల నిర్మించుకొని యట నుందుము.

భర—దేవా ! సెలవు,

(అందఱు నిష్క్రమింతురు.)

శ్రీ పాదుకా పట్టాభిషేకము సంపూర్ణము.



# స్వరాజ్యధ్వజము

**వెల 0—12—0.**

ఇందు పంజాబుహత్యలు, తిలకు రాయు భారము, వారతమాత విలాపము అనేక స్వరాజ్యవిషయములను గురించి వ్రాయబడినది. ఇందునుగురించి విశేషము వ్రాయబనిలేదు. తప్పక కొనవలసిన పుస్తకమిదియే. ప్రతిభారతీయుని హస్తమందు వుండితీరవలసిన గ్రంధరాజమిదియే. వేయేల ప్రతిపుస్తకభాండాగారమందు అలంకరించితీరవలయును. వెల స్వల్పము ఫలమధికము.

# హనుమద్రామ సంగ్రామము

**వెల 0—10—0 మాత్రమే.**

ఇందు యయాతిరాజును గురించి శ్రీరాముడు ఆంజనేయుడు యుద్ధముచేయుట. ఇందలికథ పుస్తకనామమే తెలియజేయుచున్నది. ఈకథయంతయు గరుడోపాఖ్యానమువలెనే వుండును, కథాసందర్భము చిత్రవిచిత్రముగా వ్రాయబడినది. ఈపుస్తకము అనేకచోట్ల నాటకము ప్రదర్శించియున్నారు. దీనినిగురించి విశేషము వ్రాయబని లేదు. కొలదిప్రతులుమాత్రమే ముద్రించినారము. త్వరపడినగాని దొరకనేరదు. నేడే కార్డు వ్రాయుడు

# కంఠాభరణం

**నాటకము 0—12—0 మాత్రమే.**

ఇది పానగంటి లక్ష్మీనరసింహారావుగారిచే రచియింపబడి అనేకచోట్ల నాటకమాడబడుచున్నది. దీనియందు అంతయు విచిత్రమే. ఎచ్చట చదివిచూచిన ఆనందమే. సోమావధానులుగారి చాదస్తము రామశాస్త్రుల్లుగారి పిచ్చి, వేపారిపంతులు వేశ్యాసంభాషణము సుబ్బిశెట్టి షష్ఠిపూర్తి మహోత్సవము నబాబుగారి దర్జా మొదలైనవి విచిత్రముగా వ్రాయబడినవి. ఈపుస్తకము చదువునప్పుడు జన్మకాలమున యెప్పుడు నవ్వనివారైనను కడుపుబ్బనవ్వుపుట్టించక మానదు, తప్పక కొనితీరవలెను. చదివితీరవలెను. ఆనందించి తీరవలెను. వెల స్వల్పము ఫలమధికము.

## గ్రామోఫోను హాస్యపుపాటలు

వెల 0—6—0.

ఇది శ్రీవల్లూరి జగన్నాధరావుగారిచే రచియింపబడినది. ఇందు కోడిపాట, వదినపాట, లంజపాట, గోంగూరపాట, పద్మబ్రాహ్మణిపార్సు, పోలిపాట మొదలైనవి ముప్పదిరెండుపాటలు గలవు. వింతవింతపాటలు, నవ్వువచ్చే పాటలు గలవు. వెల స్వల్పము, అనేక చోట్ల యీపాటలు గ్రామఫోనులో పాడబడుచున్నవి. ఇదివరకు నాల్గుకూర్పులు పుస్తకములు అయిపోయినవి. ఇది ఐదవకూర్పు. త్వరపడినగాని ప్రతులు దొరకనేరవు. నేడే కార్డు వ్రాయుడు.

## సంగీత విష్ణులీల

వెల 0—12—0

ఇందు శ్రీహరి అవతారములన్నియు నాటకముగా వ్రాయబడినవి. దీనియందు పార్శీకర్నాటకమట్లుగూడా గలవు. ఈప్లాటుగ యింతకుమున్న యీనాటకము నెవ్వరిచేతను రచియింపబడియుండలేదు. ఈబుక్కు అచ్చువేయుచుండగనే అనేక ఆర్డరులు వచ్చియున్నవి. ఈనాటకము ప్రతివారి హస్తమందు వుండితీరవలెను. కొనితీరవలెను. చదివి ఆనందించి తీరవలెను. ప్రతిపుస్తకభాండాగారమునందునలంకరించి తీరవలెను. ఆలస్యముచేసినచో ప్రతులుదొరకనేరవు.

## వేశ్యాహితబోధిని

వెల 1—0—0

ఇందు వేశ్యలయొక్క మాయోపాయములున్ను, విటులయొక్క చరితామము, వేశ్యలకు మేడకట్టించి దివాలాతీయుటయు అనేకమైన చిత్రవిచిత్రమైన ఫార్సులతో నిండియుండును. చాలా అద్భుతముగా యుండును.

వలయువారు:—తిరుకూరి సుబ్బారావు బుక్కుసెల్లర్,

భీమడోలు, కృష్ణాజి

# సంపూర్ణ మహాభారతము.

## ఐదంకముల పౌరాణిక నాటకము

[గ్రంథకర్త:—బళ్ళారి-పండిత-శ్రీ. సుబ్రహ్మణ్యశాస్త్రులు గారు]

ఇందు పాంచాలీస్వయంవరము. మయసభయందు దుర్యోధనుని పరాభవము, కృష్ణసత్యభామల విహారము. కరిపురియందు ద్రౌపదీమానసంరక్షణము. అమరావతి నందనవనములో అర్జునునితో శృంగారసంభాషణ ఊర్వశి అర్జునుని పేడియౌనట్లు శపించుట. ఉత్తరవనవిహారము. ఉత్తరాభిమన్యుల అన్యోన్యసంభాషణ. బృహన్నలా పాత్రరులు గోగణమును మరలించుటకై బయలుదేరుట ఉత్తరుని భయము. అర్జునుని సాహసధైర్యములు. భీష్మద్రోణాశ్వత్థామాదులనోడించి గోవుల మరలించుట ఉత్తరాభిమన్యుల వివాహము. శ్రీకృష్ణరాయబారము విశ్వరూపసందర్శనము. నారదవ్యాస నందులసంభాషణ. యుద్ధభూమియందు భీష్ముడు చూపిన శౌర్యప్రకటనము. అర్జునకు శ్రీకృష్ణుడు భగవద్గీత ఉపదేశించుట. పాండవులు శిఖండిని ముందుంచుకొని భీష్మునిజంపుట. అర్జునుడు బాణములచే భీష్మునకు అంపశయ్య నేర్పరచుట. బాణతో పాతాళగంగ దెప్పించిభీష్ముని దాహశోకదీర్చుట. (ఆశ్చర్యము) పద్మవ్యూహము ద్రోణుడు పన్నుట. అభిమన్యుడు చిందరవందరజేసి ప్రవేశించుట తిరిగి పోలేక యందు చిక్కుకొనుట దుర్యోధనకర్ణసైంధవులు బాణతూణీరములువిరుగగొట్టి అభిమన్యుని యన్యాయముగ చంపుట. అభిమన్యుని మరణమునకై ఉత్తరవిచారము ధర్మజభీమార్జునుల దుఃఖము. అర్జునుడభిమన్యుని మరణమునకు కారకుడైన సైంధవుని చంపెదనని ప్రతిజ్ఞచేయుట. సైంధవుడు దాగుట శ్రీకృష్ణమాయచే సూర్యుని కనబడకుండ చేయుట సైంధవుడు బయటకువచ్చుట అర్జునుడు బాణముచే సైంధవుని సైంధవునితండ్రి హస్తములందు సైంధవుని శిరస్సుపడవేయుట. సైంధవునితండ్రి నశించుట. కర్ణుడు యుద్ధభూమి కరుదెంచుట శల్యుడు మనసు తిరుగుమాటలు కర్ణుని నీసడించి అర్జునుని పొగడుట కర్ణార్జునుల యుద్ధము- కర్ణుని రథము నేలకు క్రుంగుట. అర్జునుడు బాణముచే కర్ణుని గూల్చుట. దుర్యోధనుడు చింతాక్రాంతుడై ద్వైపాయనహ్రదమునందు దాగుకొనుట పాండవులు పోటుమాటలాడి బయటకు రప్పించి భీమునిచే గదాయుద్ధమున దుర్యోధనుని తొడలు విరుగగొట్టించుట. దుర్యోధనుని పరితాపము కృపాశ్వత్థామాదులు దుర్యోధనుని యూరడించుట.అశ్వత్థామ తన తండ్రియగు ద్రోణుని జంపినందుకు పాండవులను అర్ధరాత్రిజంపుట. హస్తినాపురి వీధులు ప్రవేశము పట్టాభిషేకమండపము. ధర్మజపట్టాభిషేకము. మొదలగువిషయములను నిండియున్నది.

రు. 1 8 0

తప్పు

స్వల్ప

వలయువారు:—

కురుకూరి సుబ్బారావు బుక్ సెల్లరు
భీమడోలు పశ్చిమగోదావరిజిల్లా.

# భక్తకబీర్

[గ్రంథకర్త—కొడాలి సత్యనారాయణరావుగారు]

భక్తిరస ప్రధానమగు నూతన నాటకరాజము. దీని నీవఱలో నాటకముగ నెవ్వరును రచియించియుండలేదు. ముద్దులొలుకు పదములుగల పద్యములతో విరాజిల్లుచుండును. వేదాంతరహస్యములు విపులముగఁ దెలుపఁబడినవి. సందర్భానుసారముగ భక్తిరస ముట్టిపడునటుల నందందు శ్రీరామకర్ణామృతశ్లోకములు, భజగోవింద శ్లోకములు, చక్కని కీర్తనలు గలిగి ప్రదర్శనయోగ్యముగా నున్నది. అనేక సమాజములవారీనాటక ప్రకటనమును విని ముద్రణకై తొందరించుచుండుటచేతను చివఱకు ప్రతుల వ్రాసికొనవైనఁ బోవుదమని పదేపదే వ్రాయుచుండుటచేతను శీఘ్రముగా వెలువరించుటకు గారణమైనది. గ్రంథకర్తగారీకృతిని ఆంధ్రపత్రికాధిపతులగు శ్రీయుత కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారికి సమర్పించుటచే గ్రంథ ప్రశస్తినిఁగూర్చి వేఱుగ మేము నుడువనక్కఱలేదు. ఆలసించినఁ బ్రతులు దొరకనేరవు. నేఁడే కార్డువ్రాయుఁడు.

వెల రు 1—4—0.

## వేశ్యాహితబోధిని.

ఇందు వేశ్యలయొక్క మాయోపాయములున్ను, విటులయొక్క పరితాపము, వేశ్యలకు మేడకట్టించి దివాలాతీయుటయు అనేకమైన చిత్రవిచిత్రమైన హాస్యలతో నిండియుండును. చాలా అద్భుతముగా నుండును.

వలయువారు:—కురుకూరి సుబ్బారావు బుక్కుసెల్లర్,
భీమడోలు, కృష్ణాజిల్లా.

